శ్రీరస్తు.

శ్రీమాత్సర దేవతాద్యైనమః.

# దేవీభాగవతము.

ద్వితీయస్కంధము.

ఇది

శ్రీ తిరుపతి వేంకటేశ్వరులచే

రచియింపఁబడి,

శ్రీ భైరవముద్రాక్షరశాలలో,

ముద్రింపించి ప్రచురింపఁబడెను.

మొదటికూరు, 1,000 కాపీలు.

మచిలీబందరు.

దీనివెల రు 0—6—0.

1909.

# విషయసూచిక.

—:o:—





శ్రీమత్పరదేవతాయై నమః.

# శ్రీదేవీభాగవతము.

## తిరుపతివేంకటీయము.

### ద్వితీయస్కంధము.



చర్లకులాంబుధిరా
కాచంద్ర! సమస్తయాచకసురద్రుమ! ధీ
వాచస్పతి! దుర్మతదు
ర్వాచాదుర్వల్లిశస్త్రి! బ్రహ్మయశాస్త్రీ. ౧

గీ॥ అవధరింపు మనంతరం బఖిలమునులు, సూతుఁ గన్గొని హర్షసమేతు
లగుచు, సత్యవతి నెట్లు కైకొనె? శంతనుండు, మున్నె యామెకు
వ్యాసుండు పుట్టుటెట్లు? ౨

వ॥ వ్యాసునిజన్మంబును సత్యవతియాథార్థ్యమ్మును సవిస్తరముగా
నెఱింగింపు మనవుడు సూతుండు.

ఉ॥ అంబ! నినుం దలంచుజను లందఱు ధర్మము నర్థకామమో
క్షంబులు గాంతు రీవకద? సర్వనియంత్రివి నీమంత్రరా
జంబు పఠించు వారలకు శాశ్వతసిద్ధి ఘటించు మత్త్వణా
మంబును సేకరించి నను మాన్యవచోవిభవుం బొనర్పుమా. ౩

క॥ అని యంబకు మ్రొక్కిడియో, యనఘులు వినరయ్య! మునుల హార్వ
తి తేజుం, డనఘుం డు పరిచరవసుం, డనుచేది ధరాధినాథుఁ డలరుం
ధరణిన్. ౪

గీ॥ అతనితపమున కెద మెచ్చి యమరనాథుఁ, డొక్కదివ్యవిమానంబు
నొసఁగె దాని, నెక్కి యుపరివీథుల నేగుచుండు, కతన నుపరిచరా
ఖ్యను గాంచె నతండు. ౫

క॥ ఆతని సహధర్మిణి తరు, ణీతిలకము గిరిక యనఁగ నెగడు మఱితనూ
జాతులు గల రాతనికి గు, ణాతతు లైదుగురు వార లధికబలాఢ్యుల్.

క॥ వారలఁ దత్తద్దేశధ, రారమణులఁ గా నొనర్చి రమణీమణి త
న్నారాధింపఁగ సుఖియై, స్వారాజుం బోలె నుపరిచరవసు వుండెన్.

వ॥ అంతఁ గొండొక కాలంబున నొక్కనాఁడు గిరిక ఋతుస్నాతయై తనరాక కెదురుచూచుచుండె నయ్యవసరమ్మున,

గీ॥ శ్రాద్ధ మొనరించుకొనఁ దగుసమయ మిప్పుడు, గానఁ గానకు నేగి
మృగములఁ గొట్టి, తె మ్మనుచుఁ బితరులుఁ గడు నెమ్మిమెయి విధించు
టయు లోనఁ గొంత చింతించి యతఁడు. ౧౦

క॥ పితృవాక్యం బొనరింతునొ, సతివాక్యం బారుతునొ విచారించినచోఁ
బితృవాక్యము సేఁతయ సమ్మతమని తాఁ దుట్టతుదకు మదినూహించెన్.

క॥ బిత్తరిపైఁ జిత్తముకడు, హత్తినవాఁడయ్యు మృగయకరిగెన్ వనికిన్
జిత్తముసాంబశివునిపై, బత్తి నుఱొక్కయెడ నించి పార్థివుఁడంతన్.

వ॥ ఇట్లు చని కానం జరించుచున్నంత.

క॥ ఆలావణ్యవతీమణి, పై లోలుపుఁ డైనకతనఁ బంచాస్త్రుఁడు పూ
గోలలు నాటిన రేత, స్స్ఖాలిత్యము వొడమె నుపరిచరవసువునకున్.

క॥ అటువొడమినశుక్లమ్మును, వటపత్రమునందుఁ బట్టి వ్యర్థముగాకుం
డుటకై ఋతుమతి యగుతన, కుటిలాలకయొద్ది కనుపఁ గోరి కడంకన్

వ॥ ఎదుటం జరించునొక డేగం బిలిచి పత్రపుటనిక్షిప్తం బగు వీర్యం బభిమంత్రించి యిట్లనియె.

గీ॥ దీనిఁ గొని పోయి గిరికాసతీమణికి నొ, సంగు మమ్ముద్దియయు ఋతు
సమయమిప్పు, డియ్యది యమోఘవీర్య మెందేని దీనిఁ, బాఱవై
చెద వేమొ? యోపక్షిరాజ! ౧౨

వ॥ అని యద్దానిం బనిచిన నదియు నవ్వటపత్రపుటంబు ముక్కునం గఱచుకొని యుప్పరమ్మున కెగసి యరుగు నెడ ముందట.

గీ॥ దానిఁ గనుఁగొని మఱి యొకశ్యేన మామి, షభ్రమంజేసి వేవేగ
సమరమునకు, డీకొనిన నయ్యదియుఁ దానిఁ దాఁకి యొపి, నంత
పాటిగఁ బోరాడునవసరమున. ౧౩

వ॥ చంచూపుటనిక్షిప్తం బగునప్పత్రపుటంబు యమునోదకమ్మునం జాఱి పడిన నద్దాని విప్రశాపోపహతయై మత్స్యమై పడియున్న యద్రిక యనునొకయచ్చర మ్రింగె నని చెప్పుసూతుం గాంచి తచ్ఛాపకారణం బెఱింగింపు మనవుడు నాతం డి ట్లనియె. ౧౪

మ॥ యమునాతీర్థమునం ద్విజుం డొకండు సంధ్యావందనాసక్తుఁ డో
యములోనం దిగి వార్చుచున్నసమయంబం దద్రికాకాంత తో
యము లాడన్ జనుదెంచి మున్గి ద్విజు డాయం బోయి తత్పాదయు
గ్మము హేలాగతిఁ బట్టి లాగుటయుఁ దత్కంజాక్షిపైఁ నాతఁడున్.

క॥ అలిగి విసారాంగన వై, జలమునఁ బడియుండు మనుచు శపియించిన న
వ్వేలఁదియు నాతనిచరణం, బులఁ బడి దీనాస్య యగుచుఁ బుర
పుర పొక్కన్. ౧౫

వ॥ దానిం గరుణించి కొండొకకాలమ్మునకు నీగర్భంబున నొక బాలుండును బాలికయుఁ బుట్టుదు రాక్షణంబ నీకు నిజస్వరూపంబు ప్రాపించు నది య శాపాంతం బని చెప్పి యరిగె నయ్యచ్చరయుఁ దచ్ఛాపవశమ్మున నయ్యమునాజలమ్మున మత్స్యమై యుండి, ౧౬

క॥ ఉపరిచరవసువువీర్యం, బు పరిగ్రహియించి గర్భమును దాలిచి యం
దుపచితగర్భ యగుచు న, న్నపుడు వలం బడియె దాశయంత్రిత
యగుచున్. ౧౭

వ॥ వాఁడు నద్దానిగర్భంబు భేదించిన నొకబాలుఁడును నొక బాలికయుం బొడమిరి వారిం గొని వసురాజునొద్దకుం జని సకలంబెఱింగించిన వసువు విస్మయావిష్టుండై బాలకుం గ్రహియించి బాలికను మత్స్యజీవి కొసంగె నబ్బాలిక కాళికయని యు మత్స్యోదరి యనియు మత్స్యగంధి యనియు నామత్రయమ్మున నొప్పి తద్గృహమ్మున వర్ధిలుచుండె. బాలుండు మత్స్యుండను నామమ్మున వసురాజగృహమ్మున సర్వవిధములఁ బిత్రుకల్పుం డై వృద్ధినందె. ౧౮

గీ॥ మత్స్యరూపమ్ము వదలి యమరవరాంగి, యగుచుఁ దనయిచ్ఛ నరిగె
నయ్యద్రికయును, మత్స్యగంధియు దాశసమ్మతిని వాని, పుత్రికయుఁ
బోలె వృద్ధిని బొందెఁ బిదప. ౨౦

ఉ॥ జవ్వన మంది యొన్నఁ దగుచక్కఁదనంబును మేల్మిచెక్కులున్
మవ్వపుఁగన్నులున్ ముఱువుమాటలు గుల్కుపిసాళిగుబ్బలున్
నవ్వులతేటలున్ సొలపునం దగు మేటివిలాసపున్నడల్
నివ్వటిలంగ నక్కలికి నేరుపుకూరుపు నాఁ జెలంగుచున్. ౨౧

వ్యాసోత్పత్తి.

గీ॥ ఉన్నయెడఁ దీర్థయాత్రార్థ మొక్కనాఁడు, యమున కేగి పరాశర
యతివరుండు, దాఁటునిచ్చను నక్కన్నతండ్రిఁ బిలువఁ, గూఁడుగుడు
చుచుఁ దనచిన్నికూఁతు ననిపె. ౨౨

క॥ మునివరుఁ డీతం డీతని, ననుపు మవలిగొడ్డునకు నయంబుగ నని చె
ప్పినఁ దండ్రిమాటఁ గొని య, వ్వనజాక్షియును వచ్చె మౌనివరుఁ
దాఁటింపన్. ౨౩

వ॥ వచ్చి యుడుపం బెక్కించుకొని నడుపుచున్నంత.

ఉ॥ ఆయువతీమణిం గలసి యాయమునం దరియించుపట్టునన్
గాయజుఁ డాగ్రహించి మునికాంతునిపైఁ జిగురాకుబాకులం
గోయని యార్చి యేయఁ దనకుం గలధైర్యముఁ దక్కి యాతఁ డ
త్తోయజనేత్రిచారుకరతోయజ మల్లన ముట్టె ముట్టుడున్. ౨౪

క॥ సకియ యొలనగవునగుచుఁద, నకరం బెడఁ జేసికొని యనఘ! మీబోట్లిం
చుకయును సందేహింపక, యకటా! నాబోఁటిబోటి నంటం దగునే.

ఉ॥ నీవు వసిష్ఠుమన్మఁడవు నేను నిషాదునికూఁతురన్ దగన్
భావమునందుఁ జూడు మిది భావ్యము గా దిటు చేసినన్ గులం
బా! వెలిఁజెందు మౌనివరులా! హసియింతురి తంబు నష్టమై
పోవు భవాదృశుల్ వెడఁగుఁ బోకలకుం దగునార లాదురే. ౨౬

క॥ తపమునకును నంశంబున, కుపద్రవము సంభవించు నూహింపక యి
ట్టిపనికిఁ జొరఁబడ నగునే? తపసుల కెందేని యిట్టితగులము లున్నే.

మ॥ అనఘా! మానవజన్మ మెత్తుట యసాధ్యం బగ్రజత్వంబు గై
కొను టన్నం గడు దుర్లభం బదియు నీకుం జేకురెన్ మీఁద గా
సిని లెక్కింపక మౌనివై తపము వాసిం జెంది పెంపొందు నీ
వనిమిత్తంబుగ మారుబారి బడి నన్నాసింపఁగాఁ జెల్లునే. ౨౭

వ॥ అదియునుంగాక.

ఉ॥ చేఁపంకంపుచే నెగడి చెప్పఁగ రానియసహ్యభావముం
జూపెడినాశరీరమును జూచి పయిం బడ నిచ్చగించె దీ
వోపిక మాని దీన సుఖ మున్నదొ లేదొ గ్రహింప వయ్యయో!
పాపపుమారుబారిఁ బడి పండితభావము రిత్తపుత్తురే. 28

వ॥ ఇట్లు బోధించెడి తనపలుకులు వినని వానింబోలె నటించి
మరలఁ గరగ్రహణంబొనర్చుటయు సయ్యతివ తనమనంబున,

ఉ॥ ఈతఁడు పంచబాణశితహేతిపరంపరచే గృహీతుఁడై
యాతురుఁ డయ్యె నిక్క మిఁక నాఁగఁడు కాముకులైనవారికి
న్నీతియు జాతియుం దెలియ నేర్చునె? యంచుఁ దలంచి యెంతయుం
జాతురి మీఱ నచ్చటులచారువిలోచన మాని కిట్లనున్. 30

ఉ॥ తుందుడు కింత చెల్లునె? బుధుండవుగావె? మనంబునన్ ధృతిం
జెందుము చిత్తవృత్తి నికఁ జిందఱవందఱఁ జేయఁ బోకు నా
యందము నీమనమ్మునకు నందినదేని భవన్మనోరథం
బుందగఁ దీర్తు నోడ్డునకుఁ బోవఁగ నిమ్ముడుపంబు నావుడున్. 31

క॥ హిత మగునమ్మాటకు సమ్మతిఁ జెంది పరాశరాఖ్యమౌనివరుఁడు నా
సతికరము వీడి యవ్వలి, కతిరయమునఁ జేరి మరల నాకర్షించెన్.

మ॥ అటుపైపైఁ బడునమ్మునీంద్రుఁ గని యయ్యబ్జాక్షి యాకంపితో
త్థటభీత్యుత్కటదేహయై మునివరుం గామాతురుం జూచి తా
నిటు పల్కున్ వినుమా మదేహ మిది యెంతే మీనదుర్వాసనా
ఘటితం బీస్థితి నైనవస్తువులఁ భోగ్యంబౌనె? మీజాతికిన్. 33

గీ॥ అదియునుం గాక సంయోగ మనఁ సమాన, రూపయౌవనవంతుల కే
పొసంగు, నను నవస్థ్యానివస్థ్యఁ డత్యాదరమునఁ, గాంచి యద్దాని
యోజనగంధిఁ జేసె. 34

మ॥ మృగనాభీఘుమఘుంఘుమార్భటులు పేర్మిన్ మించుమైతావితో
సొగసుంగుల్కెడిముద్దునెమ్మొగముతో సొంపౌకు కెమ్మోవితోఁ
దొగల న్నవ్వ మెఱుంగుఁగన్నుఁ గవతోఁ దోరంపుగారాముతోఁ
దగునత్తన్వికరంబు వట్టె ముని కందర్పజ్వరావిష్టుఁడై. 35

క॥ శరము౦ బట్టెడియమ్మును, వరునిం గని పల్కె మానివర? విను లజ్జా
విరహితమతివై నయమును, బరికింపక పట్టపగలు పట్టం దగునే.

గీ॥ అరయుచున్నాఁడు నాతండ్రి యవలియొడ్డునందు నదిగాక మార్గస్థు
లరుగుదెంచు, వారో! యేమొ? యిటుల్ పశువై ఖరిని ర, మింపుటకు
నామనము సమ్మతింప దనఘ. 32

గీ॥ కాలనియమము పశులసాంగత్యమున క, నవసరము గాని మనుజుల
కట్లు గాదు, కాన నామాట విని రాత్రికాలమబ్బు, దనుకఁ గాలము
పాపకృత్యం బిదేల. 3౮

గీ॥ నీకుఁ బ్రీతి చెప్పఁగా నోప నీవెఱుఁగని, యట్టిధర్మంబు కలదే?
కామాతురత్వ, మింతగా నీమనము నలయించెఁగాక, పట్టపగ లిట్టి
పనిఁ జేయఁబాడి యగునె. 3౯

గీ॥ దాశపుత్రికతోడఁ బరాశరుండు, పట్టపగలు నదీతటీభాగమందు
తగులోనర్చె నటంచు వింతగ జనమ్ము, లాడుకొనుమాటలు సహింప
నగునె పిదప. ౪౦

క॥ అని పలుకునత్తలోదరిఁ, గని యుక్తమ పల్కి తీవు కల్పించెద మం
చు నిదియచీఁకటివలె మన, కనుకూలం బగునటంచు నటులొనరించెన్

గీ॥ మంచు నాలుగు దెసల వ్యాపించి తమము, గలుగఁ జేయుడు నవహ్నాని
కాంతుఁ డంత, నించువిల్లాని కేళి కాసించుటయును, బలికె నత్తన్వి
మధురసంభాషణమును. ౪౨

గీ॥ కన్నియను నేను నాతోడఁ గలసి సుఖము, వడయ నుంటి వమోఘ
వీర్యుఁడవు నీవు, దేవ? నీయిచ్ఛకొలఁదినం దేనిఁ జనెద, వయ్యయో!
నాదుబ్రతు కేమి యగునో పిదప. ౪౩

సీ॥ తలిదండ్రుల్ దల లెత్తలేక కడువంతన్ పున్గి యొగ్గింతు ర
న్నలుఁ దమ్ముల్ పెలుచారిమోములు గనన్ శంకించి లజ్జింతురే నె
చ్చెలు లన్నం గడు గేలి సేయుదురు వాసిన్ బెండ్లి గాఁ బోదు క
న్నెలకుం జారుఁడొసఁగ్చువేఁకటు లవెం తేఁ జింత గల్పింపవే. ౪౪

గీ॥ గర్భవతినౌదు నేని నీకతన నేను, నీవు నీతో(డ్రి)వం బోవ నానేర మెట్లు
తండ్రి యెఱుంగనివిధమున దాంచికొందు, ననఘ? యోజించి చెప్పు
సదుపాయంబు నాకు. ౪౫

వ॥ అనిపట్టరానిభయమ్మునం గొంకుచున్నదాని కాతం డిట్లనియె.

గీ॥ నీకు నాపొందుఁ జేసి కన్నెతికమునకు, హాని వాటిల్ల కుండెడు నది
యుంగాక, గోరుకొను [illegible] లెల్ల, ననుచు ముని కిట్టు
లనియె నవ్వ్యాసజనయుఁ. ౪౬

సీ॥ తల్లిదండ్రుల కీయుదంత మించుకయేనిఁ దెలియకుండంగ సంధించు
టొకటి, నిన్నుఁ బోలం గల్గుచిన్నారిపొన్నారిచెలువతపాపని దయ
సేయు టొకటి, కన్యాత్వమున కించుకయు నిందు నందు లోపమ్ము
లేకుండఁ గాపాడు టొకటి, యక్షయం బగునట్టియౌవనం బేవేళ మిం
చుకతినిఁ గటాక్షించు టొకటి; గీ॥ మీనగంధంబు వాపి నామేని
కిప్పు, డీ వాసంగినకస్తురితావి చేర్చ, చెడక వాసించుపద్ధతి చేయు
టొకటి, నాకు దయచేసి యామీఁద నన్నుఁ గొనుము. ౪౭

వ॥ అనుచున్నదాని కతం డిట్లనియె.

మ॥ నిగమమ్ముల్ విడఁదీయువాఁడు సొబగు న్నేర్పుగ్ దయాళుత్వముం
దగువాఁ డుత్తముఁ డూర్జితాత్ముఁడు పురాణంబుల్ వెలిం జేసి యీ
జగతిక్ బరగు గాంచువాఁడు హరితేజస్స్ఫూర్తి మన్మూర్తి నాం
డు గుణంబుల్ కలవాఁడు నీ కొకసుపుత్రుం డుద్భవించుం జెలీ

వ॥ తక్కినవీకోర్కె లెల్ల నట్లయగునని మఱియును,

ఉ॥ అచ్చరమచ్చెకంటులగు మొయారపు బాలకసి యూరకున్న నా
కిచ్చ జనించె నేఁడు కమలేక్షణ! దైవవశంబుఁ జేసి, నీ
మచ్చపుఁదావి యెడ! నిను మన్నన చేసి వరించు టెడ! నా
సచ్చరితం బదేడ! తలవక్యమె? దైవకృతంబు దాఁటఁగన్. ౪౯

గీ॥ నీకు నాకారణమున సుశ్లోకుఁ డైన, పుత్రుఁడుదయింపఁగాఁ గలపుణ్య
ముండెఁ, దప్పుఁ జేయఁగ నెవ్వరితర మటంచు, దాశపుత్రిక నెనసెఁ
బరాశరుండు. ౫౦

క॥ తనవశమగునక్కన్నియ, నెనసి పరాశరమునీంద్రుఁ డెంతయుసుఖలీ
లను దేలి యమునలోపల, మునిఁగి శుచియగుచుఁ దనంతఁ బో
యినపిదపన్. ౧౧

క॥ ఆగుణవతియును దాస, ద్యోగర్భము దాల్చి మిగుల నుజ్జ్వలతేజ
శ్శ్రీ గలిగి చెన్నుమీఱు వ, హాగుణనిధి యైనయొక్క యనఘుం
గనియెన్. ౧౨

గీ॥ పుట్టునంతన యామహాపురుషుఁ డంబ, కెఱిగి యిట్లను నీవు యథే
చ్ఛఁ జనుము, నేను దపమున కేగెద నీవు నన్ను, నెపుడు దలఁచిన
నప్పుడ యేగుదెంతు. ౧౩

వ॥ అనవుడు సత్యవతి నిశ్చింతయై తనతండ్రిపాలికిం జని సుఖం
బుండె నతండును ద్వీపమ్మునఁ బుట్టినకతమ్మున ద్వైపాయనుం డని
యు వేదంబులు విభజించినకతన వ్యాసుం డనియుఁ బరఁగి యష్టాదశ
పురాణమ్ములును మహాభారతమ్మును రచియించి సుమంతు జైమినిపైల
వైశంపాయ నాసితదేవలముఖ్యు లగుశిష్యులకును సుతుం డగుశుకునకు
ను నుపదేశించె. ౧౪

గీ॥ సత్యవతి పుట్టె నట్లు వ్యాసముని పుట్టె, నిట్టు లిట సందియమొకింత
యేని వలవ, దనఘు లగువారిచరితలయందు గుణము, గ్రాహ్య
మగుఁ గాని దోషంబు గ్రాహ్య మగునె. ౧౫

గీ॥ కారణం బిట్టు లుండినకతన సత్య, వతికి మత్స్యోదరమ్మునఁ బడు
టయును బ, రాశరునిఁ బొందుటయును సంప్రాప్త మయ్యె, నట్లు
గాకున్న మునియుఁ గామార్తుఁ డగునె. ౧౬

గీ॥ శంతనునృపాలుఁ డామీఁద సత్యవతిని, దా గ్రహించి సుఖించి సం
తతినిబడసె, జిత్రముఁ బవిత్ర మిక్కథఁ జెప్పినాఁడ, దీని వినువార
లకు శుభస్థితులు గలుగు. ౧౭

వ॥ అనినుడువుసూతుం గని మహాత్మా? నీచెప్పినసత్యవతీజన్మం
బును వ్యాసోత్పత్తియును సంతోషదాయకంబులయ్యె నింకొకసందియం
బు గలదు పురువంశజుండును ధర్మాత్ముండును మహాభాగుండును న
గుశంతనునృపాలకుండు కులహీన యగునిషాదపుత్రిక నెట్లంగీకరించె

నతనికిఁ బ్రథమపత్ని యెవ్వతె? యితనికొమరుండగుభీష్ముఁడు వస్వంశసం
భూతుం డగుకతం బేమి? సకలగుణసంపన్నుఁడును జ్యేష్ఠుండును నగు
భీష్ముండు రాజ్యంబు సత్యవతీతనయుల కేల యిచ్చె? సత్యవతి తనకోడం
డ్రయందు గోళకుల నెట్లు జనియింపం జేసె? భీష్మునికి దారసంగ్రహంబు
లేనికతం బేమి? యిది యిట్లుండ. ౫౮

సీ॥ వేదముల్ విభజించి మీఁద వేదాంతసూత్రము లొనర్చినయట్టిబ్ర
హ్మవేత్త, పదియు నెన్మిది యనంబడుపురాణమ్ములు పచరించినట్టిసర్వ
జ్ఞమౌళి, అదిగాక భారతం బన నొప్పుపంచమాగమ మొనర్చినమ
హాకవివరుండు, ఇది పుణ్యకృత్య మియ్యది పాపకృత్యం బటం చె
ఱింగి చరించునట్టితపసి; గీ॥ వ్యాసుఁ డాసించె భ్రాతృభార్యాసుఖం
బ, టంచుఁ జెప్పితి వకట! పరాంగనాసు, ఖంబె పాతక మన భ్రాతృ
కాంతతోడఁ, గ్రీడ సల్పుట కెట్టు లంగీకరించె. ౫౯




గీ॥ వ్యాసశిష్యుండ వైననీ కఖిలధర్మ, సూక్ష్మత లెఱుంగ వచ్చునో సూత!
దీని, కుత్తరము సెపవె మాదరాయత్తమతి న, టంచుఁ బల్కెడి
మునుల కిట్లనియె నతఁడు. ౬౦

క॥ కలఁడు మహాభిషుఁ డనుభూ, తలనాథుం డతఁడు సత్యతత్పరుఁడు
ధరా, తలనాయకమకుటమణీ, విలసితచరణుండు బ్రహ్మవిద్యాధి
కుఁడున్. ౬౧

గీ॥ అశ్వమేధసహస్రమ్ము లాచరించి, దాన నింద్రుని సంతుష్టుఁగా నొనర్చి,
స్వర్గమున కేగి యచ్చట సకలసౌఖ్య, ములను రెండవయింద్రుఁడై
పొందుచుండె. ౬౨

వ॥ ఒక్కనాఁడు దేవతలతోడఁ జతురాసను సేవించుటకై సత్య
లోకమ్మునకుం జనియె.

క॥ గంగానదియును బరమే, ష్ఠిం గని కొనియాడ నచ్చటికి వచ్చి వి
రిం, చిం గాంచి మ్రొక్కి యొక్కయోఁ, డం గాలూది నిలువంబడం
దెమ్మెరయున్. ౬౩

చ॥ బలువడి వీవ నాపెతొడఁబైఁ గల చీరచెఱంగు దూఁగి యా
వలకొకకొంత నోరసిలె వస్త్రము దూలుట దా నెఱుంగ క
క్కలికి యు మిన్నకుండె నటు గాంచుట తప్పని యొక్కపెట్ట నా
దలలను వంచి రీనృపుఁడుదక్క. సభాసదులై ననిర్జరుల్. ౬౪

ఉ॥ తన్ను మహాభిషుం డతిముదమ్మునఁ గన్గొనుచుండ గంగయుఁ
గన్నులవిల్తు బారిఁ బడి కన్గొన సాగె నృపాలుమోము, ని
ల్లెన్నఁగరానిమోహమున నిద్దఱు గాఢతరానురాగులై
యున్నతఱిఁ గనెఁ గమలజోద్భవుఁ డెక్కుడు తామసమ్మునన్. ౬౫

క॥ పెద్దలు గలయీసభ నీ, రిద్ద ఱపత్రపఁ ద్యజించి యిటు నిర్భయులై
మొద్దులవలె నటియించెద,రిద్దాని సహించు టొప్పునే? సుజనులకున్.

వ॥ ఇట్లెంచివారలం గాంచి «మంచిచెడ్డ లెఱుంగక వర్తించితిరి
గావున మీ రిరువురును మర్త్యలోకమ్మునం బుట్టుం డని శపించె నంత
వారును శాపంబునకుఁ జింతిల్లుచు నచ్చోటు వీడి వెడలిరి. ౬౭

గీ॥ ఆమహాభిషనరపాలుఁ డంత మర్త్య, లోకమున నెవ్వనికులమ్ములో
జనింతు, ననుచు యోజించి పురువంశమునఁ బ్రతీపుఁ, డనునృపుని
దండ్రిగా నెంచె నాత్మయందు. ౬౮

వ॥ ఇది యిట్లుండె.

గీ॥ అష్టవసువులుఁగూడభార్యాసమేతు,లగుచు విహరించుచును వసిష్ఠా
శ్రమంబు, నందుఁ జరియింప నందొక్కయతనిభార్య, నందినీధేనువు
ను జూపి నాయకునకు. ౬౯

వ॥ ఇది యెవ్వరిది యని యడుగుడు నత్తన్వి కాతం డిట్లనియె

గీ॥ చెలియ? యిది గలవాఁడు వసిష్ఠమౌని, దీని నెల్లరు నందినీధేను వం
డ్రు, దీనిపాలిన్ని గ్రోలినఁ దేవులు జరయు, మృతియు దరిఁ జే
ర వని తనపతి వచింప. ౭౦

వ॥ ఆసతియు ముదం బంది «నా కుశీనరరాజకన్యక కడు నెయ్యం
బు గలయది యాపె మర్త్యలోకనివాసిని యగుటఁ దన జరామరణాదికం
బుఁ బొరయఁ గలదు తన్నివృత్తికై యీ ధేనువు నద్దాని కొసంగి యు
పకృతి నొనర్ప వలయు నిద్దాని నాకై తె మ్మనుడు. ౭౧

సీ॥ ఆవసువు భార్యమాట పథ్యమ్ముఁ జేసి, తక్కుఁగలవసువులఁ గూడి
దాని నపహరించె రాఁబోవు నాపద నెంచఁడయ్యె, నంగనాసక్తు
లాపత్తు లరయఁ గలరె. ౨౨

వ॥ పిమ్మట వసిష్ఠుండు తనధేనువుం గానక వెదకించి విసివి తన
యోగబలమ్మున వసువు లపహరించుట యెఱింగి మనుష్యయోనిం
బుట్టుం డని వారలకు శాపం బిచ్చె, పడఁపడి దాని నెఱింగి వార లతని
కడ కేతెంచి శాపమోక్షం బనుగ్రహింపవే యని వేఁడుడు మునివ
రుండు కరుణించి యిట్లనియె. ౨౩

మ॥ అనుసంవత్సర మొక్కొక్కళ్ళకగు శాంపాంతంబు నాధేనువుం
బనిగా భార్యకునై హరించె నెవఁ డాపాపాత్ముఁ డాకష్టుఁ డ
మ్మనుజత్వమ్మును దీర్ఘకాలము వహింపంగాఁ గలాఁడంచు న
మ్ముని శాపాంతము సెప్ప నవ్వసువులిమ్ముల్ చేరుచున్ ముందటన్.

వ॥ విధిశాపవశమ్మున దీనాననలై భువి కేతెంచుగంగం గాంచి
తమశాపప్రికారం బెఱింగించి "తల్లీ? నీగర్భమునం జనించెదము మమ్ము
ననుగ్రహించి శంతనునృపాలకున కీవు పత్ని వగు మిదియునుం గాక. ౨౫

క॥ పుట్టినతోడన మమ్ముం, గిట్టింపుము నీట వైచి కీడెంచక నీ, విట్టు
లొనరించుకతమున, నెట్టన మాశాప మది వినిర్ముక్త మగున్. ౨౬

క॥ అని వసువులు తనుఁ బ్రార్థింప, చినఁ దా నంగీకరించి చెచ్చెర గం
గా, ధుని తనయిచ్చం జనియెన్, జనిరి వసువులును గడంగి స్వర్గ
మ్మునకున్. ౨౭

వ॥ పిమ్మట ప్రతీపుఁ డొక్కనాఁడు గంగాతటమ్మునకుం జని
సూర్యోపాస్తి యొనర్చుచున్నంత. ౨౮

ఉ॥ ఆసలిలమ్మునన్ వెడలి యంకురితప్రధమానయౌవనో
ల్లాసిని చారుహాసిని విలాసిని వే చని రాజశేఖరుం
దాసి యశంకితాత్మయయి దక్షిణపుందొడఁ గూరుచుండఁగా
నాసరసీరుహాక్షిఁ గని యాధరణీపరిణేత యిట్లనున్. ౨౯

ఉ॥ ఎవ్వతె వీవు? నాదుకుడి వెక్కుట కేమికతంబు? వల్కు మో
జవ్వని! యన్న నచ్చటులచారువిలోచన ముద్దు లొల్కఁగా

నవ్వా మొగమ్ము వంచి నయనమ్ము లొకానొకవింత నెల్వున
న్నివ్వటిలంగఁ బల్కెఁ దగు నేరుపు తోరపుఁ దీరుపుం దగన్. ౧౦

ఉ॥ ఎవ్వతె నైన నేమి పృథివీశ! సుమాస్త్రసమానరూప! నా
జవ్వన మంత నీకయి వశం బొనరింపఁ దలంచి వచ్చితిన్
జివ్వకు వచ్చునమ్మదను చెయ్వుల కోరువఁ జాల సక్కటా!
నవ్వులు గాఁ దలంపకుము నావచనమ్ము లటన్న నిట్లనున్. ౧౧

క॥ కన్నెరో? యపత్యమునకుం, దన్నళినాథులకు యోగ్యత గలకుడి
తోడన్, గ్రన్న నధిష్ఠించితి కా, న న్నిను నేఁ గొనఁగఁ దగదు నా
కటుమీఁదన్. ౧౨

ఆ॥ వె॥ భార్యఁ దక్క నొండు పడఁతిఁ గూడ నటంచు, వ్రతము గలదు
నాయపత్యమునకుఁ, బత్నివై సుఖమ్ము వడయుము నాకు సం, తానమొ
దవెనేనిఁ దలిరుఁబోణి. ౧౩

క॥ సంతానహీనుఁ డితఁ డని, వంతం గొనఁబోకుమీ! భవత్పుణ్యామ నా
సంతానకారణం బగు, నింతయు నిక్క మన నాపె యేగెఁ దనంతన్.

వ॥ అంతఁ గొండొకకాలమ్మునకు మహాభిషుండు ప్రతీపునకుఁ
దనయుండై శంతనుండు నాఁగ వర్ధిల్లుచుండెఁ బ్రతీపుఁడును. ౧౪

క॥ గంగకుఁ దనకుం జరిగిన, సంగతి కొమరునకుఁ జెప్పి చనియెం దా
రా,జ్యాంగమ్ము విడిచి యడవి న, సంగుండై యుండి తపము సలుపు
నెపమునన్. ౧౫

వ॥ శంతనుండు పైతృకం బగు రాజ్యమ్ము నేలుచు నొక్కెడ మృగ
యార్థంబు వనమ్మునకుం జని వ్యాఘ్రాదిమృగమ్ములనుక్కడంచుచు గం
గాతటకుంజపుంజమ్ములం జరించువాఁడు ముంపట. ౧౬

సీ॥ మృగశాబములకు నేర్పెడినేర్పు గలచూపుసోయగం బొలుకుకం
దోయిదాని, కుంభికుంభములయుక్కును దొక్కి నిక్కి నీల్గెడిగుబ్బ
చందోయిబెడఁగుదాని, మాటమాటకు ముద్దు మూటఁగట్టఁగఁ
జాలుసొగసుచే నెగడు నెమ్మొగముదాని, ముకురమ్ములకుఁ జాకచకిఁ
దీర్పఁగాఁ జాలుతళ్కుఁ జెక్కులతళతళలదాని; గీ॥ తొగలవగకానిజిగి

బిగినగఁ డొనర్చు,నిగనిగలఁ దగునగవుసోయగము దానిఁ, దావులకు
దీవి యగు కావిమోవి దానిఁ,గనియె నొకకన్నెఁ గన్నులకలవుదీఱ.

కం॥ సురకన్యకొనియయ్యెం, బురుహాసనఁ జూచి తండ్రి మున్నుతనకునే
విరిబోణిఁ జెప్పెనీసుం,దరి యయ్యతివయొకొ యంచుఁ దనమదినెంచున్

ఉ॥ సుందరుఁ డైనయానృపతిసూనునిఁ జూచి తదంబుజాక్షి "యీ
యందపుటెక్కు నిక్కము మహాభిషుఁడే" యని రాగమగ్నయై
కంది మనోజతాపమునఁ గ్రాఁగి పునఃపునరాదరోదయా
నందమునం దదీయవదనంబునఁ జూడ్కి నిగుడ్చి యున్నెడన్. ౯౦

కం॥ శంతనుఁడు దానిరీతిం,గొంత గనుంగొని రసమ్ము గులుకఁ బలికె "నో
యింతీ! మరుదంతీ! విరి, బంతీ! నీవెవ్వతెవొ కృపం బలుకఁగదే.

ఉ॥ ఎవ్వతె వైన నేమి కమలేక్షణ! నిన్ గనుఁగొన్నమాత్రన
ప్పువ్విలుకానికైన భ్రమ పుట్టక మానదటన్నఁ బ్రాకృతుం
డెవ్వఁడు నిన్నుఁ జూచి సహియించు! ననుంగరుణించి నాకు నీ
జవ్వనపూర్ణవినోదము లొసంగఁగదే! తగదే! యలంచుటల్. ౯౨

వ॥ అనిమదనశరదళితహృదయుండై వల్లునజ్జనపతిని మహాభిషు
నిఁగా నెఱింగినయది గావునఁ బూర్వసంఘటితప్రేమవశమ్మునఁ గించిత్స్మి
తపూర్వకంబుగా నిట్లనియె. ౯౩

చ॥ తెలియఁగ నెమ్మెనీవలప్రతీపునిపుత్త్రుఁడ వత్యుదారస
త్త్వులుఁడవు నిన్ను బోఁటినృపకోటిశిరోమణి నెట్టికామినీ
తిలకములైనఁ గోరుదురు దేవసమానుఁడ వైననిన్ను నే
వలచియ యుంటి నైన నొకపల్కు వచించెద నాలకింపుమా. ౯౪

ఉ॥ ఏ నొనరించుకార్య మది యొట్టిది యే నగుఁ గాక నీవు న
ద్దానికి నడ్డురాఁ జనదు దాని నటుండఁగ నిమ్ము విప్రియం
బైనవిధమ్ము నన్నను నొకప్పుడు గాని వచింపఁ బోల ది
ట్లైన నినున్ వరించి సుఖ మందెదఁ గోర్కులు మిన్నుముట్టఁగన్.

కం॥ ఈనియతి కెపుడు ప్రత్యా,ఖ్యానంబొనరింతువపుడయరిగెదఁ జుమ్మీ
భూనాథ? నిను విడిచి నా, పైనేరము మోపవలదు పలికితి నిపుడే

క॥ అని వసువులప్రార్థన నె, మ్మనమునకుం దెచ్చుకొని క్షమానాథుని పై
ర్మి నెఱిఁగి సమయం బొనరిం, చిన నందుల కొప్పె నెదురు చెప్ప
క యతఁడున్. ౯౭

వ॥ గంగయు నతనియందుఁ జిరకాలలబ్ధానురాగయైనకతమ్మున
నఁ దన్నృపమందిరమ్మునకుం జనిసుఖభోగమ్ములనుభవించుచుండె. ౯౮



భీష్మోదయము.

సీ॥ వరరత్నఖచితసుందరతరాప్రతిమానవైచిత్ర్యయుతసౌధవాటులందు,
కోకిలాకాకలీకేకిలీలాకలధ్వనకనదుద్యానవనములందు,
హంసాదిసంశోభితాసమానాంభోజషండమండితసరస్తటులయందు,
గంభీరరంభావిజృంభమాణనవీనఘనసారఘనకుంజగణములందు;
గీ॥ శంతనున్నృపాలకుండు నక్కాంతయును స, దా శచీంద్రులమా
డ్కిఁ బద్మాహరులవి, ధమ్మున నఖండభోగభాగ్యమ్ము లనుభ,వించు
కాలంబు పెద్దయ్యు నించుకయ్యె. ౯౯

ఉ॥ తా నెవఁడో ప్రపంచపువిధాన మదెట్టిదొ యన్య్యు లెవ్వరో
తా నివసించువాసమువిధం బది యెట్టిదియో యెఱుంగక
మ్మానవనాథుఁ డక్కలికిమక్కువలోఁ బడి యున్నయంత న
మ్మానిని దాల్చె గర్భ మసమానవసుప్రవరాంశమై తగన్. ౧౦౦

వ॥ గర్భంబు నవమాసపూర్ణంబై యొక్క బాలకుం దుద్భవించుడుఁ
దత్క్షణంబ వానిం గొనిపోయి నీటం బడ వైచె నిట్లేటేటం బొడమిన
బాలుర నేడ్వుర నేటంబడవైచిన శంతనుండు మనమ్మున నిట్లువిచారించె.

మ॥ అకటా! యేడ్వురుపుత్రులన్ గుసుమబాణాకారులన్ నిర్దయా
త్మికయై నేటికి నప్పగించె నిఁక వృద్ధిం జెందు టెట్లొక్కొ? మా
మకవంశం, బిది కూడదన్నను ననున్ మన్నింప కీకాంత లే
చి కడు న్వేగమ పోవు నిట్లగునె? దుశ్శీలాంగనాసంగముల్. ౧౦౨

క॥ అష్టమగర్భం బిది, మదదృష్టముకతనన్ లభించె నిపుడైనను నీ
దుష్టాత్మురా లొనర్చెడి, కష్టపుఁబని నాకు నాఁగఁగాఁ జెల్లదొకో.

వ॥ కావున నేవిధంబుననైన వంశరక్షణంబు కర్జం బని నిశ్చ
యించి యున్నంత. ౧౦౪

క॥ అంగనకై మునివరుగో, వుం గొనిపోయినవసుండు పుత్రుండై పు
ట్టం గని గంగయు వైళము, గంగం గలుపంగ నెంచఁగా నృపతి వెసన్.

వ॥ అడ్డమ్ము సొచ్చి వినయమ్మున నబ్బాలింతరాలి కిట్లనియె.

ఉ॥ దాసుఁడ నైతి నాపలుకు దబ్బఱ సేయకు కన్నపుత్రు వ్య
త్యాసినివై వధింపు టిది న్యాయమె? జాలి యొకింత లేదె? యే
దోసము నీకొనర్పనిసుతున్ వధియించెడిగొడ్డురాల? నీ
బాసలకున్ మదిం దలఁకి వంశము నాశ మొనర్ప నెంతునే. ౧౦౯

క॥ అకటా! యేడ్గురఁ జంపితి, విఁక నైనన్ జాలిలేదె? యేణాక్షిరో? యీ
గొకనిం బ్రతికింపుము తా, వకచరణయుగంబుమీఁదఁ బడి
మ్రొక్కెదుమున్. ౧౦౭

క॥ సుతులం బొరయనియెడ స, ద్గతి లే దని పెద్ద లండ్రు గావున వంశ
స్థితికై యీసుతు నొక్కని, బ్రతికించిన నీవ్రతంబు భగ్నం బగునే.

క॥ అని బహువిధములఁ బ్రార్థిం,చిన విన కావనిత చిన్నిశిశువుం జంపం
గొనిపోవుచుండ నిట్లనె, జనపతియున్ గనుల వహ్ని జలజల రాలన్.

గీ॥ ఓసి పాపాత్మురాల? నాశాసనం బ, తిక్రమించియు నరకభీతియును లేక
కన్నకొడుకుల గంగలోఁ గలుప నగునె?, యకట! నినుఁ గనినట్టి
దుష్టాత్ముఁ డెవఁడొ. ౧౧౦

వ॥ ఉందువుగాక పోదువుగాక యీశిశువుం జంప నీ నని యడ్డమ్ము
సొచ్చెడిశంతనుం గాంచి యక్కోమలి యిట్లనియె. ౧౧౧

చ॥ సమయము నెంచవైతి విఁక సాగదు నీకును నాకుఁ గూట ము
త్తముఁడవు నీవు నిన్విడు టధర్మము కాని వచింతుఁ దన్నిమి
త్తము, నను నొక్క కాంతఁగ నెదన్ గణియింపకు గంగా నెఱుం
గుము సురకార్యమున్ సలుపఁ గోరి నినున్ వరియించితిం జుమీ.

క॥ వసువులు మునిశాపమ్మున,వసుమతిఁబుట్టుటకు నన్నుఁ బ్రార్థించిననేఁ
బ్రసు వైతి వారలకు నీ,కు సతి నయినృపాల? దెలిసికొను మిదిమెల్లన్

క॥ చిరకాలముమర్త్యులమై, ధరణిన్ వసియింప లేము తత్క్షణమ మృతిం
గరుణింపు మన్న నే నీ, దురితం బొడిఁగట్టి నీటఁ ద్రోచితి సుతులన్.

క॥ ఈతం డష్టమవసుకళ, చేతఁ జనియించె నధిప! చిరకాలము నీ
చేత ముగరఁగించెడి(వ, ఖ్యాతిం జెందం గలాఁడు కాఁగలఁడు సుమీ.
గీ॥ ఈడు వచ్చెడిదన్క ను వీఁడు నాస, మీాపమంద వసించు నామీాఁద నీకు
నప్పఁజెప్పెద దీనికినొప్పికొనుము,తల్లిలేకున్న బ్రితుకు వృథా నృపాల
క॥ అనినుడివి గంగయునుడన, తనయుం గొనిచనినమీాఁద ధరణీపతి య
వ్వనితావిరహమ్మునకుం, దనయవిరహామునకుఁజాలఁదల్లడపడుచుఁ.
వ॥ ఒకభంగి రాజ్యం బొనర్చుచుఁ గొండొకకాలమ్మునవేఁటఁజని
మృగమ్ముల హింసించుచు విరహాభరమ్మునఁ జిక్కినయదియుం బోలె
నున్నగంగానదిఁగాంచి. ౧౧౮
శా॥ ఆకల్లోలినిమధ్యరంగమున దీవ్యద్బాణబాణాసన
శ్రీ కైసేయ నిరంకుశప్రతిభమైఁ గ్రీడించుచుఁ జాపవి
ద్యాకౌశల్యముఁ జూపునొక్క రుని గందర్పుఁ విడంబిఁచువి
వ్యాకారంపుబెడంగువానిఁ గని తా నాశ్చర్యపర్యాప్తుఁడై. ౧౧౯
క॥ తనతనయుం డని యనుకొనుఁ, దనతనయుఁడు గాఁడటంచుఁ దలఁ
చుఁ మరలఁ, దనయాసక్తి గను శం, తను డబ్బాలకునిఁ గాంచి
తద్దయుఁ బేర్మిఁ. ౧౨౦
క॥ కరలాఘవమును దుష్కర, శరలాఘవమును నమానుషత్వముఁదెలు
పన్, నరపతి దరి కరిగి మహా, దర ముట్టిపడంగ నిట్లతనితోఁ బలికెన్.
ఆ॥ వె॥ తల్లి యెవతె నీకుఁ? దండ్రి యెవ్వడు? నీదు, నామధేయ మెద్ది?
నగర మెద్ది?, చెప్పు మనుడుఁ బల్కు సెవినిబెట్టక తన,యంత నాడు
చుండె నతఁడు పేర్మి. ౧౨౧
వ॥ అంతఁ గొంతతడవు గ్రీడించి యాతం డంతర్హితుం డగుడు
జనపతి చింతాకులుండై గంగఁ గొనియాడి తొంటిరూపునఁ బొడసూ
పిన నాపె కిట్లనియె. ౧౨౩
సీ॥ చిన్నారిపొన్నారిచిఱుతప్రాయమువాఁడు ముద్దు లొలికెడినవ్వుమొ
గమువాఁడు, కళల నీనెడిగొప్పకనులనొప్పెడ్వాఁడు కరికలభాకార
గరిమవాఁడు, ఆజానులంబిబాహాసౌష్ఠవమువాఁడు హరి నీసడించు
మధ్యమ్మువాఁడు, శరశరాసనవిభాసురకమ్ములవాఁడు డంబు చెన్నారు

పక్షంబువాఁడు; గీ॥ నాకుఁ బొడకట్టి యంతట నన్ను మొఱఁగి,
చనియె నొకముద్దులాఁడు వాఁడనఁగ నెవఁడు, తెలిపి వైళమ
యవ్వానిఁ దెచ్చిచూపి, గారవింపుము నావుడు గంగ నగుచు.

క॥ ఎనిమిదవవసునియంశం, బున బుట్టినవాఁడు నీకుఁ బుత్త్రుఁడు గాంగే
యు నిఁగా నెఱుఁగుమువానిఁ, గనఁజేసెదఁగనుముకనులకఱవెడలంగన్.

వ॥ అని యర్భకుం దెచ్చి చూపి యితండు సకలవేదమ్ములును
వసిష్ఠునియొద్దఁ బఠించె వేయేల నీబాలుండు పరశురామునికిం గూడ
శిష్యుండును సర్వథా యయ్యఘునకుఁ దుల్యుండును భవత్కులోద్ధార
కుండును నని చెప్పి యంతర్ధానంబుఁ గనుడు శంతనుండు పుత్త్రుం గాఁగి
లించుకొని రథమ్ముపై నిడికొని రాజధానికిం జని మంత్రిపురోహితాను
మతంబుగ సుముహూర్తమ్మున యౌవరాజ్యాభిషిక్తుం జేసి గంగావియో
గజం బగుదుఃఖమ్ము మఱచి సుఖం బుండె. ౧౨౭

క॥ ఇయ్యది వసువులచరితం, బియ్యది శుభదంబు దీని నెంతయు నాపై
నెయ్యమ్మున ద్వైపాయనుఁ, డయ్యరశిజుతోడఁ గలిపియానతియిచ్చెన్.

వ॥ అనినసూతుం గాంచి మును లన్వాలికత చెప్పు మనవుడు
నతం డిట్లని చెప్పం దొడంగె.

గీ॥ యౌవరాజ్యమ్ము గాంగేయునందు నిలిపి, శరవణోద్భవుచే మహేశ్వ
రుఁడువోలె. సర్వసుఖములు గైకొంచు శంతనుండు, నాలుగేడులా
నందాబ్ధి నోలలాడె. ౧౨౯

వ॥ పదంపడి యొకనాఁడు మృగయాసక్తుండై నిరంతరకుంజపుంజ
మండితం బగుకాళిందీతటమ్మునకుఁ జని యచ్చట.

సీ॥ పన్నుగున్నలవంటి మెసకమ్ము గల్గు కారడవిపందులబీర మడఁచియడఁచి
భూధరమ్ములపాటి పొడవుగల్గిన యేనుఁగులమొత్తముల నేలఁగూల్చి
కూల్చి, శమనవాహనమునైన సమయింపఁగాఁ జాలుపులులగుంపుల
తోడఁ బోరిపోరి, విక్రమాటోపదుర్వోధమ్ము లగుసింగములగము
లెల్లను గలఁచికలఁచి; గీ॥ జవముమెయిగాలితోఁ బోలఁ జాలుజేడి,
తోపులను దూపులను రూపు మాపిమాపి, ప్రళయకాలకిరాతుని
పగిది జంతుమండలమ్మును వేఁటాడి మగిడి యతఁడు. ౧౩౦

వ॥ ఒక్క శీతలతరుచ్ఛాయాతలమ్మున నిషణ్ణుండై యున్న యెడ,

క॥ ఆనందోద్దీపకమై, నానాపరిమళవిశేషనవసౌరభమై
జానొప్పఁజాలునొకగం, ధానిల మేతెంచి నరవరాగ్రణి నెనసెన్.

వ॥ అతండును దత్పరిమళమ్మున కచ్చెరువంది.

మ॥ మృగనాభిం బురణించి యబ్జములపేర్మిం గ్రిందుగాఁజేసి సం
పెఁగలం డీకొని కేతకీసుమములన్ బిట్టేచి కుందమ్ములం
దిగు లొందించియు మాలతీసుమములం దిండ్రించి నిర్మైతుకం
బుగ నేతెంచు పరీమళం బిది సుఖాంభోరాశిలో ముంచెడిన్. ౧౩౨

క॥ దీనికిఁ గారణ మేమొకొ, కానఁగవలెనంచు వేడ్క గడలుకొనంగా
నానాపుష్పాకీర్ణ,ం బై నెగడు వనాంతమెల్ల నరయుచుఁ జనుచున్.

చ॥ అమరినవేడుకన్ గనియె నబ్జముఖిన్ నవసౌరభోజ్జ్వల
ద్భ్రమఘుమ విగ్రహన్ గమలకుట్మలచారుపయోధరద్వయన్
యమితశిరోజభార మలినాంబర నాతివిభూషణాంచితం
దములపుటాకువంటి యొక తామరసపత్రిమానలోచనన్. ౧౩౪

క॥ ఆకలికి నాతలోదరి, నాకలకంఠీలలామ నాకనకాంగిన్
భూకాంతుండిటుగన్గొని,యీకన్నియ యేమనితావియేయిది యనుచున్.

ఉ॥ దానిపిసాళిగుబ్బలును దానియొయారపుఁజూపుఁదీపులున్
దానివళిత్రియీగరిమ దానిశరీరపరీమళంబు న
ద్దానివయోవిలాసమును దానిపదక్రమసౌష్ఠవంబునున్
దేనికి నగ్గలం బనుచుఁ దీరనికూరిమిగారవంబునన్. ౧౩౬

శంతనుండు సత్యవతిం బెండ్లియాడుట

వ॥ డగ్గఱి సిగ్గరితనమ్మునన్ మొగ్గునగ్గజగమనం బునఃపునరాద
రోదయమ్మునం గనుఁగొనుచుఁ దనమనమ్మున,

క॥ ఈసుగుణ దేవతాకాం, తామాళియొ! కిన్నరాంగనామణియొ! ఫణి
స్త్రీమూర్ధన్యయొ! కాకీ, భూమిన్ గలపోలఁతి కిట్టి పొలుపుంగలదే.

క॥ అని తలపోయుచు నాశం, తనుజనపతి తొల్లి దైవతధుని దనువరిం
చినభంగిఁదలఁచుకొని య,త్తనుమధ్యన్ బేర్మిఁజూచి తగనిట్లనియెన్

ఉ॥ ఎవ్వతె వీవు? నీజనకుఁడెవ్వఁడు? జవ్వని! యివ్వనమ్మునం
దెవ్వనికై చరింతు? కులమెయ్యది? నీ విటు లొంటిపాటునన్
మవ్వపుమేనికాంతి కనుమాయఁ జరింపఁగ నేమి వచ్చె? నీ
కెవ్వఁడు భర్త? దెల్పఁగదవే? మదవేల్లితదంతిగామినీ. ౧౩౯

క॥ నీసొగసు నీవిలాసము, నీసౌరభ్యంబుఁ జూచి నేనెంతయు నీ
దాసించి మదనభూత, గ్రాసీభూతుండ నైతిఁ గరుణింపఁగదే. ౧౪౦

వ॥ అన నక్కాంత చిఱునగవలర నిట్లనియె.

ఉ॥ కన్నెనుగాని వేఱొక ప్రకారము దానను గాను దాశరా
జన్నయభిఖ్యగన్న సుగుణాత్ముఁడు నాజనకుండు నన్ను "నా
వ న్నడిపించుచుండు మిదె వచ్చెద" నంచు వచించి డించి పో
మె న్నరనాథ? యింటి,కదియే యతఁడుండెడితావు నావుడున్.౧౪౧

చ॥ నరపతియిట్లు వల్కు నరనాథుఁడ నేఁ గురువంశజాతుఁడన్
దరుణి? ప్రతిక్షణప్రబలితం బగుజవ్వనమున్ వృథాగతిం
బొరయఁగఁ జేయ నేల? ననుఁ బొందు మసంశయరీతిఁబత్నివై
పరమసుఖమ్ములం గొనుము పత్నియు గిత్నియు వేఱులేదిఁకన్.౧౪౨

ఉ॥ ఓసరసీరుహాక్షి? విను మొక్కలతాఁగి ననున్ వరించి పే
రాసలు గొల్పి పోయె నది యాదిగ నేను మఱొక్కలేమపై
నాస విగుడ్పనైతి నిను నారసినంతన బుద్ధి పుట్టె నీ
దాసుఁడ నైతి నావిదురతం బెడఁ బాపుట కిచ్చగింపుమా. ౧౪౩

వ॥ అని సరసంబుగాఁ బల్కు నజ్జననాయకునియందు బద్ధానురాగ
యయి యత్తొయ్యలి లజ్జించుచు నిట్లనియె.

క॥ నిను నేచెడియుమ్మదనుఁడు, ననుమాత్రము విడిచిపెట్టునా? యెందేనిన్
వినుమొక్కమాట ధర్మ, మ్మునకుం గట్టువడవలదె పూవుంబోడుల్.

ఉ॥ పెద్ద లెఱింగి కన్నెలకుఁ బెండిలిసేయుట పాడిగా నితా
గద్దఱియై తనంతన యొకానొక నాయకుచెట్టవట్టినన్
పెద్దఱికంబు వాయదొకో! పెద్దలకుం దలవంపు నింపదో!
హద్దు నతిక్రమించుట కులాంగనకు న్విహితప్రచారమే. ౧౪౫

ఉ॥ ఈపరతంత్రురాలి నిటు లీవు వృథా మొగమోట పెట్టి సం
తాపము నొందఁజేయకుము ధర్మముమర్మ మెఱింగి యించుకే
నోపిక చేసి మజ్జనకునొద్దకు నేగి తదాజ్ఞఁ బూని న
న్నాపయి స్వీకరింపు మతఁ డన్నిట ధీవరుఁ డింత యొప్పదే. ౧౪౬

గీ॥ ఇట్టు లొప్పఁగఁ జెప్పనయ్యింతి కెదురు,మాటచెప్పఁగలేమి నమ్మనుజ
విభుఁడు, దాశగృహమునకేగెఁ దత్కన్య నతని,యనుమతింగొని వరి
యింప నాత్మ నెంచి. ౧౪౭

ఆ॥ వె॥ వచ్చుచున్న నృపతివరుని దాదవ్వల, నరసి ధీవరుఁడు గృతాం
జలి యయి, యెదురువచ్చి వినయ మెసఁగంగ నిట్లనె, గౌరవప్ర
పత్తి గడలుకొనఁగ. ౧౪౮

వ॥ ఏను భవద్దాసుండ నిచ్చోటికి మీరు విచ్చేసినకతన ధన్యుం
డనైతి నావలనికార్యం బానతిమ్మనుడు నతం డిట్లనియె. ౧౪౯

క॥ నీ కనుమతి యగునేనిన్, గైకొనియెద ధర్మపత్నిగా నీతనుజన్
రాకాచంద్రనిభానన, నాకోరిక చంద మిది యనన్ మన మలరన్.

చ॥ అనఘుఁడుఁ బల్కు నాతఁ డధిపా! కడు భాగ్యము గాదె నాతనూ
జను వరియించి నాకులము శస్తము గా నొనరింపు మెన్న నీ
కు నొసఁగు వాఁడ నైన నొకకోరికఁ గోరెద మత్తనూజకా
తనయుఁడు నీయనంతరము ధారుణికిం బతి గావలెంజుమీ. ౧౫౧

వ॥ అనుదాశునివచనంబులు విని శంతనుండు గాంగేయుం దలం
చుకొని నిరుత్తరుండై చింతాక్రాంతుండై యచ్చోటు విడిచి తనగృహ
మ్మున కేతెంచి దాశకన్యాగతమనస్కుం డగుచు నశనాదికంబు వర్జించి
యున్నంత. ౧౫౨

క॥ గాంగేయుఁ డెలమిఁ దనతం, డ్రింగని యిట్లనియె బేలరీతిని నిటుగుం
దం గతమేయ్యదియొకో! తత్సంగతియొక్కింత నాకు దయఁ దెల్పఁగదే

గీ॥ దుర్జయుం డగుశత్రుఁడు దొడరె నొక్కొ, సలుపఁగా రానికార్యంబు
గలిగె నొక్కొ, యేను గలుఁగఁగ గొదవ నీ కెట్లు గల్గు, నేల చిం
తింప వచియింపవే? మహాత్మ. ౧౫౩

క॥ జనకుని చింతం దీర్పని, తనయునిఁ దనయుఁడని చెప్పఁదగ దండ్రి
బుధుల్,మనమునడాఁపక చెపుమా,యనఘా!నీకున్న కోర్కె యది నేఁదీర్తున్

సీ॥ తండ్రియాజ్ఞనుగదా! దశరథాత్మజుఁడు భార్యానుజోపేతుఁడై యట
విరిగె, నలహరిశ్చంద్రభూపాత్మజుం డగురోహితాస్యుండు జన
కాజ్ఞ నమ్ముడువడె, యజ్ఞపశువుగాఁగ నంగీకరించె శునశ్శేపుఁడు దన
జనకునియాజ్ఞఁ, బరశురాముఁడు తల్లిశిరము డొల్లఁగనేసె జనకాజ్ఞ
దాఁటరాదనియకాదె; ఆ॥ వె॥ చేయఁ దగనిచెట్టనేఁతయైనను బూ
ర్వు, లాచరించు టెందునరయఁ దండ్రి, యాజ్ఞకన్న ముఖ్యమైనది
వేఱొండు, గా దటంచుఁ దెల్పఁగాదె యధిప. ౧౫౬

క॥ తాను సమర్థుండయ్యును, బూనికమై జనకుకోర్కె పూరింపని యు
వ్వానిది జన్మమె?వాఁడును, మానిసి యే? పశువుగాక మానవనాథా.

ఆ॥ వె॥ తండ్రి కోర్కెఁదీర్చి తనియింపఁగాలేని,పుత్రకుండు జగతిఁ బుట్ట
నేమి?,గిట్టనేమిఫలము! గిట్టవా! పుట్టవా!, స్వేదజములు మఱియు
భేదమేమి. ౧౫౮

క॥ అని పల్కుతనయుఁ గని శం,తనుఁ డిట్లనులజ్జమనముదరికొనఁ దనయా
గనుఁగొనుముచింతగాదే తనయుండొక్కరుఁడయైనఁదండ్రికిఁదలఁపన్

క। ఒకకొడుకు కొడుకునుంగాఁ,డొకకన్నును గన్నుగాదయో! పుత్రా!దై
వికగతి వాఁడందినఁ దం, డ్రికి వేఱొండుగతి గల్గనేర్చునె యెందున్.

వ॥ ఇట్లు చింతాక్రాంతుండై యున్నతండ్రియుదంతంబు సాం
తంబుగాఁ దెలియంగోరి యమాత్యులంబనిచిన వా రున్నయునికి నెఱిఁగి
భీష్మునకుం జెప్పిన నతండు తదమాత్యులతోడం గలసి దాశరాజుసద
నమ్మునకుం జని యతనితో నిట్లనియె. ౧౬౧

ఆ॥వె॥ ఓయి! దాశరాజ! యొసఁగుమీపుత్రి మ,జ్జనకుఁ డైనశంతనునరపతికి
మాత యైననీదుకూఁతున కే నెల్ల, యెడల భక్తుఁడనని
యెఱుఁగు మనఘ. ౧౬౨

క॥ అన దాశుం డిట్లను నో, యనఘా! నీ కిచ్చెదను మదాత్మజ సతిగాఁ
గొను మీవుండఁగ నేత, త్తనయుం డీనేల నేల ధర్మమె? చెపుమా.

క॥ అనుదాశరాజునకు శం, తనుతనయుం డిట్లు వల్కు దగ నీసుత మా
తను జేయుము నా కేత, త్తనయుఁడ రాజ్యమ్ము నేలఁ దగుఁగా కనఘా

వ॥ అనుడు మహాత్మా! నీవు రాజ్యం బొల్లమియ నిశ్చయంబై
నను నీతనయుండు మద్దౌహిత్రు రాజ్యమ్మునకు సమ్మతించునే యన భీష్ముం
డతని కిట్లనియె. ౧౬౫

గీ॥ ఏను దారపరిగ్రహం బిచ్చగింప,నిట్టినా కేల పుత్త్రుఁడుపుట్టుఁ జెపుమ
నావలనిశంకమనమునఁబోవఁద్రోచి,తల్లి గాఁ జేయుటొప్పునీతనయనాకు

వ॥ అనుగాంగేయుపల్కులకు సమ్మతించి దాశుండు శంతనునకు
సత్యవతి నొసంగి పరిణయం బొనరించె.

ఆ॥ వె॥ సత్యవతిని ధర్మసతి గాఁగఁ గైకొని,సంతసించెఁ గాని శంతనుండు
పెండ్లి గాకమున్నె బిడ్డఁడు వ్యాసుండు, కలిగె ననెడిమాటఁ
దెలియఁ డయ్యె. ౧౬౬

వ॥ పిదప నతండు కొండొకకాలమ్మునకు నాసతియందుఁ జిత్రాం
గదవిచిత్రవీర్యు లనుతనయులఁగాంచె వారిరువురును గాలవశమ్మున
మృతులగుడు విచిత్రవీర్యపత్ని యగునంబిక యత్త యాజ్ఞ వ్యాసుం
గలయునెడ నేత్రనిమీలనం బొనర్చుకతనఁ బుట్టంధుండగుధృతరాష్ట్రుం
డుదయించి రాజ్యార్హుండు గాఁడయ్యెఁ బిదప రెండవది యగునంబాలికం
బనుప నాపె వెలవెలబాఱుకతనఁ బాండురోగగ్రస్తుం డగుపాండురా
జుదయించె నతండును రాజ్యార్హుండు గామి సత్యవతి పెద్దకోడలిం బిలిచి
మరల వ్యాసుం గవయు మనుడు నాపె యొల్లక కామకళావేదిని యగు
తనదాసిం బనిచిన దానికి ధర్మాంశమ్మున విదురుం డుద్భవించె. ౧౬౭

క॥ ధృతరాష్ట్రుం డంధుండగు,కతనన్ విదురుండు దాసికాన్పగుటను స
మ్మతిగాక సత్యవతియా,నతిభీష్ముం డిడియెఁ బాండునకు రాజ్యంబున్.

వ॥ అతండు విదురుండు మంత్రిగా రాజ్యం బేలుచుండె.

క॥ అలధృతరాష్ట్రుండును సౌ, బలి యగుగాంధారి యొకతె వైశ్య
యొకతె భా, ర్యలుగా సుతశతమును సౌ,బలియందున్ వైశ్య
యందుఁ బడసె నొకరునిన్, ౧౬౮

ఆ॥వె॥ సౌరసేని కుంతి సదమల మద్రభూ,పాలపుత్త్రి మాద్రి భార్యలుగను
బాండుభూవిభుం డఖండసౌఖ్యాంబుధి, నోలలాడి రాజ్య
మేలుచుండె. ౧౭౧

క॥ పుట్టింట నున్నయప్పుడ, పట్టి నొకనిఁ గనియెఁ గుంతి పాండునృ
పతి యా, గుట్టెఱుఁగమి నాపడతిం, గట్టికొనియె నేమి సెప్పఁగల
మునులారా, ౧౭౨

క॥ అన విని మును లిట్లనిరో,యనఘా! కన్నెతికమునన యక్కుంతికి సం
దనుఁ డెట్లుగల్గెనో? పాం,డునృపతి దానెట్లుకొనియెనో? తెల్పఁగ దే

వ॥ అనిన సూతుం డిట్లనుఁ దొల్లి సూరసేనాత్మజ యగుకుం
తినిఁ గుంతిభోజుండనువాఁడు సంతానంబు లేమిం జేసి పుత్త్రింగాఁ గై
కొని పెంచికొనుచు నొక్కెడ దుర్వాసుండు తనగృహం బేగుడు నతని
కిఁ బరిచర్యార్థంబుగాఁ గూఁతు నియోగించె. ౧౭౪

క॥ కుంతియు దుర్వాసున క, త్యంతము భక్తియును బేర్మి దనరఁగ సే
వల్, గొంతవడిఁ జేయ నాతం, డెంతయు సంతసము లోన నినుమడి
గాఁగన్. ౧౭౫

ఆ॥వె॥ కన్నె? వేల్పు నెవనిఁ గామించి మనమునఁ, దలఁచి కొనెదొ వాఁడు
తత్క్షణంబ, వచ్చి నీకుకోర్కె ఫలియింపఁగాఁ జేయు, మం దటంచు
నొక్కమంత్ర మొసఁగె. ౧౭౬

క॥ ఇటు లొసఁగి యతఁడు సనె న,క్కుటిలాలక యొక్కనాఁడు కుతుక
మ్మున న, జ్జటిలుఁడొసంగినమంత్రపుఁ, బటిమం దిలకింప నెంచి పఠి
యించి వెసన్. ౧౭౭

వ॥ ఉదయించుచున్నసూర్యునిం బిలుచుటయు నతండు మను
ష్యరూపమ్మునఁ జనుదెంచె నంతఁ గుంతియు వేపమానయగుచు రజోదోష
సంగతమై యతనిం గాంచి కృతాంజలియై యిట్లనియె. ౧౭౮

క॥ దేవా! తావకదర్శన మీ, వగ నొకమా టొనర్ప నే నెంచి తగన్
భావించి వేఁడితిని నా, భావము ఫలియించె నీవు వచ్చినకతనన్.

వ॥ కావున మదపచారమ్ము కతన దేవరకుఁగల్గిన పరిశ్రమంబు సైఁచి కోపింపక భవదీయమండలమ్మునకు దయసేయు మనిప్రార్థింపుడు నహర్పతి మదవిహ్వాలుండై యత్తలోదరి కిట్లనియె. ౧౮౦

క॥ పిలిచితివి వచ్చియుంటని,గలయక యే నన్నుఁబంపఁగాఁదగునే? యో కలికీ! యులరులములుకుల, కులుకంగాఁ జేయ నీకు నొప్పిద మగునే.

ఆ॥ వె॥ ఎవతెకైనఁగాని యేఁ దటస్థింతునే?, మంత్రపాటవమున మగువ! నీకుఁ, జిక్కి నాఁడ నన్నుఁ జిక్కులు వెట్టక, కలయు మబల! పేర్మి దొలకరింప. ౧౮౨

వ॥ అనవుడుఁ గుంతి సిగ్గున మ్రగ్గుచు నిట్లను.

గీ॥ కన్నియను గాని వేఱొండు గాదు నిజము, తెలియవే?సర్వసాక్షివి దేవదేవ?, నిన్ను నేఁ గోరుటయుఁ దప్పె నన్ను నీవు, గలయ నుంకించుటయుఁ దప్పె గను మొకింత. ౧౮౩

చ॥ అనవుడు సూర్యుఁ డిట్టులను నంగన! నిన్ గవఁగూడ కేను బోయినయెడ నన్ను దేవత లిహీ! యని గేలి యొనర్పరోటు! కాదని గికురింతువేని నిను నమ్ముని నిద్దఱినిన్ శపింతు నే మని యిటువంటిమంత్ర మబలా! కులబాలిక కిచ్చెఁ జూచెదన్.

వ॥ నన్నుమన్నింతువేని మత్సంపర్కమ్మునసీకన్యాత్వంబు వాసి చెడకుండఁ గాపాడుభారము నాయదియ.

క॥ ఒరులెవ్వరెఱుఁగకుండఁగ,వర మొసఁగెదఁ గోర్కె దీర్చ వగలాఁడిరో? నన్, బురణించుముద్దులొలుకు కొ, మరునిం గనరాదె? మరునిసూ అగువానిన్. ౧౮౫

క॥ అని పేర్మి గడలుకొనఁ బ, ల్కిన నచ్చెలిమెత్తవడియెఁ గ్రీడారతులం దనిపి వర మొసఁగి రవియును, జనియెం దివమునకు మనము సంతస మొనయన్. ౧౮౬

 కర్ణయుధిష్ఠిరాదుల జననము. 

వ॥ పిమ్మట నక్కుంతి చూలుదాల్చి దాదికిం దక్కఁ దక్కుఁగలవారికిం దెలియనీక యంతఃపురమ్మున నుండునెడ సహజకర్ణకుండలకవచాభి

రాముండును సర్వప్రతిమానుండును సర్వలక్షణోపేతుండును నగుకర్ణుం డుద్భవించిన లజ్జితాననయయి చింతించుచున్నకుంతికి ధాత్రేయి యిట్లనియె.

* క॥ కడచినపనికిం జింతం, గడలుకొలుపనేల? భావికార్యమ్మునకుం
బడఁతిరో? యాలోచింతము,తడబాటేలయనఁ గుంతితత్తఱపడుచున్

వ॥ ధాత్రేయికానీతం బగుమందసమ్మునందు.

క॥ బాలునిడికన్నుగొనలం, గాలువలై నీరు పాఱఁగాఁ గడుఁజేర్మిఁ
బాలిండ్లు స్రవింపఁగఁ జిం, తాలోలమనస్క యగుచు నడలుచుఁ
బలికెన్. 　　౧౮౯

ఆ॥ వె॥ ఏమి సేయుదాన నేమాచరించెడి,దాన నేమి సలుపుదాన మంద
భాగ్య నైననాకు బహులక్షణయుతుండ, వీవు దక్కువాఁడవే
కుమార! 　　౧౯౦

మ॥ తనయా! యేజగదంబ లోకము లనంతంబుల్ కృపం బ్రోచి వృ
ద్ధిని బొందించు మహానుభావ నినుఁ బ్రీతిం గాచు నాశక్తి నీ
కనయం బాఁకలి దీర్చు పారెకును స్తన్యం బిచ్చి యమ్మాత నే
జననిం గాను గుమార! నీ కఖిలముల్ సర్వాత్మ యద్దేవియే.

గీ॥ మరల నీమొగ మిఁక నొక్కమాఱుఁ గాంచు, భాగ్య మబ్బనినాకిట్టి
పాపజాతి, కకట! స్వైరిణిఁబోలె ని న్నడవిఁ ద్రోచు, సంతగతి వచ్చె
నే మని యందుఁ బుత్రి 　　౧౯౩

చ॥ కనియును నిన్నువంటితగుకానుపు నెన్నఁడుఁగాని సంతతిన్
గననియనాథవోలెఁ గొడుకా! యుడుకారెడివంత నెంతయున్.
గినవలసెన్ బురాభవమునన్ సుతసంపద పెట్టిపుట్టకుం
డిననునువంటిదాని కిడునే? జగదంబ సుతున్ భవాదృశున్.

వ॥ పిదప దాది యామె నోదార్చి మంజూషం గొని రహస్య ప్రకారమ్మున జనునెడ వంధ్య యగురాధ యనుసూతగృహిణి తన కిమ్మని యడుగ నద్దాని కొసంగె రాధయు నతనిం గన్నకుమారుంబలెఁ బోషించుచుండె. 　　౧౯౪

---

* ఈవిషయమును ఈసగ్రంథమునందలి మఱికొన్ని విషయములును విపులముగాఁ జూచువారు మాపాండవజననమునఁ జూడఁదగు.

క॥ ఆమీఁదఁ బాండునరపతి, యామగువం గొనియెఁ దా స్వయంవరమున న, త్యామరసాప్తువరమ్మున, నాముదితయుఁ గన్నెవన్నె నతనికిఁ దోఁచెన్. ౧౯౯

క॥ ఒకనాఁడా పాండునృపా, లకుఁ డడవిన్ వేటలాడ లాలసుఁడై యేగి కడుం దుష్టమృగములఁ జెనకిచెనకి యనంతరమ్మునన్ మృగరీతిన్.

క॥ క్రీడించెడిజడదారుల, జోడుం గని యందు మగని సూటియెలర్పన్ గాడంగ నేయశరసం, తాడితుఁడై కుపితుఁ డగుచుఁ దాపసి నృపునిన్·

క॥ కనుఁగొని యగ్నికణంబులు, కనుగొనలన్ రాలఁ బలికెఁ గటగట! పాపా, త్ముని ని న్నేమనఁ గల! ని, ష్పని యేమని చేసి తీ వపాస్తనయుఁడవై. ౧౯౮

క॥ క్రీడించునన్ను శరసం, తాడితుఁ గాఁ జేసి తీయధర్మ మనిన్నుం బీడించు మృత్యువై విరి, బోఁడులకూటములవంకఁ బోయితివేనిన్.

క॥ అని శపియించిన నాపాం, డునృపాలుండును మనం బనూనవిషాదం బును జెంద నయ్యరణ్యం,బున రాజ్యము వీడి వాసమును బొనరించెన్

ఆ॥ వె॥ అంత నతనిభార్య లైనకుంతియు మాద్రి, యును బతివ్రతాత్వ మనుగమించి, చని రరణ్యమునకు సతులకుఁ బతిసేవ, కన్న భాగ్య మొండు గలదె తలఁప. ౨౦౧

గీ॥ గంగ యొద్దనఁ బాండుఁ డఖండతపము, సేయుచు మునీశ్వరులసేవఁ జేసి పుణ్య, కథలు వించును గాలమ్ము గడపుచుండె, రాజ్యసంగతి మఱచి విరాగి యగుచు. ౨౦౨

వ॥ ఒక్కనాఁ డతం ‘‘డపుత్రస్య గతి ర్నాస్తి’’ యనుధర్మశాస్త్రవచనంబు విని తనకుం గతి యేమి యని వారి నడుగుడు మును లిట్లనిరి రాజా! యౌరసుండును దౌహిత్రుండును క్షేత్రజుండును గోళకుండును గుండుండును సహోఢుండును గానీనుండును క్రీతుండును పునర్భవుండును దత్తుండును నా దశవిధపుత్రు లుత్తరోత్తరంబు లొచ్చుగా గణియింపం బడుదు రిట్టిపుత్రులలో నొక్కండేనిఁ గల్గినఁ బున్నామనరకప్రాప్తి లేదని చెప్పిన విని యొక్కెడఁ గుంతి కిట్లనియె. ౨౦౩

శా॥ సౌదాసుండు వశిష్ఠమౌనివలనన్ సంతానముం గాంచి యా
మోదం బందె నటంచు వింటె దరుణీ! మోమోటమిం దక్కి దా
యాదప్రాప్తికి నొక్కమౌనివరు నీవారాధితుం జేయఁగా
రాదే? యన్వయ ముద్ధరించుట యధర్మం బౌనె? నాయానతిన్.

క॥ పతియానతిఁ గొని సతి పర,పతినైన యక్కతనసుతులఁబడసియుదోషా
న్వితగా దొక్కింతయు నని, శ్రుతి స్మృతివిదుల్ వచించు సూక్తులు
వినవే. ౨౦౭

వ॥ అనవుడుఁ గుంతి మున్ను మంత్రం బొక్కండు నేర్చి యుంటి
నయ్యది పఠించియేవేల్పుంగోరిన నతం డేతేరకతీరదు తద్బలమ్మున దేవ
తల నారాధించి తనయులం బడయుదాన. ౨౦౮

క॥ అని పతియానతి ధర్ముని, మనమునఁ దలపోయ నతఁడు మంత్రిబల
మునం, జనుదెంచె నతనిపొత్తున,జనియించెన్ ధర్మరాజసమతేజుండై

క॥ ఒకయేట వాయుదేవు, మఱొకయేటన్ దేవనాథు నొగి మంత్రబలం
బుకతన రప్పించి తగన్, వృకోదరార్జునుల నస్త్రవిదులం గనియెన్

గీ॥ ఇట్లు గుంతికి సంతాన మెసక మెసఁగఁ,గనిసహింపక మాద్రి భర్తను
గనుఁగొని, తనయు నొక్కని దయసేయఁ దగదె? నాక, టంచుఁ
బ్రార్థింపఁ గుంతికి నాజ్ఞ యిడియె- ౨౦౯

క॥ పతియానతిచే మాద్రీ, సతికిన్ మంత్రిం బొసంగెఁ జయ్యనఁ గుంతీ
సతి తన్మంత్రంబున నా, సతి నాసత్యులను బొంది సంతస మెసఁగన్.

గీ॥ నకులసహదేవు లనెడితనయులఁ గాంచె, నిట్లు పాండున కాత్మజు
లేవు రుదయ; మంది రవ్వారు పాండవు లనఁగఁ బరఁగి, రంత నొక
నాఁడు పాండుభూకాంతుఁ డెలమి. ౨౧౧

చ॥ వల దని మాటిమాటికి నివారితుఁ డయ్యును గామబాణసం
చలితమనస్కుఁడై తపసిశాపము నెంచక మద్రరాట్సుతం
గలసి గతాసుఁడై చనియెఁ గాముకు లాత్మతనూవినష్టికిన్
దలఁక రటన్న వేఱొక విధంబగుహానికి జంక నేర్తు రే. ౨౧౨

గీ॥ చెట్టువడినంతఁ జెట్టును జుట్టుకొన్న, తీవయును బోలె నపుడు మా
ద్రీలతాంగి, యానృపాలునిపైఁ బడి యడల సాగెఁ, గాంతలకు నింత
కన్న దుఃఖంబు కలదె. ౨౧౩

గీ॥ కుంతియు వగంబొగల సాగెఁ గొమరులెల్లఁ, గరముఁగుందిరి ముని
వరు లరుగుదెంచి, వారివారించి పాండుభూపతికి సుత్త, రక్రియలు
దీర్చి రంత విధిక్రమమున. ౨౧౪

వ॥ మాద్రియుఁ దనకొడుకులం గొంతి కప్పగించి సహగమనం
బొనర్చెఁ బిమ్మట మునులు సంతానసహితంబుగాఁ గుంతి నూరార్చి
దంతిపురంబున కనిపిరి ధృతరాష్ట్రవిదురగాంగేయాదులు నాయమ
నోదార్చి వీరలెవ్వ రని యడుగఁ గురుకులోద్ధరణార్థంబుగా మత్పతియా
నతి సురలవలనం గన్న సంతానంబని చెప్పి విశ్వాసార్థంబుగా వారల
నప్పుడు రావించుటయు, ౨౧౫

క॥ ధృతరాష్ట్రప్రముఖులు స, మ్మతి నాయమ నాదరించి మమత మెయిం
ద,త్సుతులసమస్తవిధమ్ముల,నతులగతులఁ జూచుచుండిరగమరలేమిన్

ఆ॥ వె॥ పాండుభూమిపతికిఁ బత్నులయం దిట్లు, సుతులు సంభవించి
రతులమతులు, వారిచరితఁ జెప్పువాఁడ నాకర్ణింపు, డాదరం
బెసంగ ననఘులార. ౨౧౭

గీ॥ వారికేవురకును నొక్క వనిత ద్రుపద, పార్థివునిపుత్రి ద్రౌపది పత్ని
యయ్యె, నేవురకు నక్కలికియందు నేవు రుద్భ, వించిరి తనూజు
లత్యంతవిమలమతులు. ౨౧౮

క॥ నరునకుఁ గృష్ణుని చెలియలు, పరమోదారగుణరూపభద్ర సుభద్రా
తరుణిసతియగుచుఁద నెన,త్తరుణికినభిమన్యుఁ డనెడితనయుఁడుపుట్టెన్

ఆ॥ వె॥ అతఁడు సమరరంగమందుఁ గాలవశంబుఁ, జెందె ద్రుపదపుత్రి
నందనులును, నతనివోలె మడిసిరాయుద్ధమునన సౌ, భద్రుభార్య
మత్స్యపతితనూజ. ౨౨౦

## పరీక్షిత్తుపుట్టుట

వ॥ ఉత్తరయనునది యప్పటికి గర్భవతియై యుండి ద్రౌణిశరా
గ్నిదగ్ధుం డగునొక్క కుమారుం గనుటయుఁ గృష్ణుం డనుగ్రహించి కురు

కులాంకూరమ్ముగా నక్షుమారుం బ్రతికించె. ౨౨౧

గీ! కులము క్షీణించునప్పుడు గలుగుకతన, నాశొమరుఁడు పరీక్షిదాఖ్యాకుఁ డయ్యె, పాండవులచేతఁ దనసుతుల్ వడినకతన, నాంబికేయుండు పుట్టంధుఁ డడలుచుండె. ౨౨౨

గీ॥ అతనిభార్య గాంధారియు నట్ల పుత్ర, శోకమున గ్రుగ్గి నిరువుర కేకరీతి, ధర్మతనయుండు పరిచర్య తగ నొనర్చి, వారియనుమతి రాజ్యంబు వడసి యలరె. ౨౨౩

క॥ విదురుండును ధృతరాష్ట్రుని, మది కింపగురీతి ధర్మమార్గంబులు సమ్మదమున బోధించుచుఁ గడుఁ, బదిలముగా నతనియొద్దఁ బొల్పడియుండెన్. ౨౨౪

క॥ తనయులు మడిసినదుఃఖం, బును మఱపించుచును ధర్మపుత్రుఁడు పితృసేవన మొనరింపఁగ భీముం, డనుదినమును నతనియెదుట నను నీరీతిన్. ౨౨౫

సీ॥ దుర్యోధనునితోడఁ దునియలు సేసి దుశ్శాసనునట్లఁ బేరాసఁ ద్రావి తక్కినసుతుల నందఱ నుగ్గు గావించి తినఁ దిండిలేమి చేసినకతమున మాయింటఁ బడి యభిమానవిహీనుఁడై కాకంబువలె సిగ్గులేక భుక్తి నలుపుచునున్నాఁడుజనుఁషాంధుఁడితనికిఁ బిండము మేమింత పెట్టకున్న;
గీ॥ వేఱుగతి లేదటం చిటుల్ విసువుమాట, లెన్నియో భీముఁ డాయమ్ము లెత్తి పలుక, నంతఁ గొనుపట్టి ధృతరాష్ట్రు చింతఁ దీర్చుఁ దమ్మునికి బుద్ధి సెప్పుచు ధర్మసుతుఁడు. ౨౨౬

వ॥ ఇట్లష్టాదశవత్సరమ్ము లటవసించి ధృతరాష్ట్రుండు ధర్మతనయునానతి వనమ్మునకరుగ దలఁచి వృకోదరుని కారణమ్మున నింతదనుకఁ దనపుత్రుల కౌర్ధ్వదైహికంబులు జరుగమి ననుస్మరించి వారలకు నివాపక్రియార్థంబుగాఁ గొంతధనంబు నడుగుడు విదురానుమతంబున నట్లొనర్పనుంకించి తమ్ములతో యోజించు నన్నం గనివృకోదరుం డిట్లను.

సీ॥ నీకారణముననే నెలఁతతో మనమెల్ల వనవాసమున గ్రుంగవలసివచ్చె ద్రుపదపుత్రి కనేకదుఃఖమ్ము లందంద నీనిమిత్తముననే నెఱి ఘటిల్లె నలవిరాటునికి దాస్యం బొనర్చుట మన కబ్బె నీమూలాన నందఱికిని

నీవగ్రజుండవు గావేని వమ్ముగా మన కధికార మెమ్మాడ్కిఁ బోవు;
తే॥ గీ॥ పుట్టినదిగోలెఁ జేసినచెట్టలెన్నఁ, దరము గాని సుయోధను
తర్పణమున, కనఘ! ధన మీఁదలంచెద వక్కటకట!, యెంత
వెట్టి వోయన్న! నిన్నేమియందు. ౨_౨౮

క॥ మునుగంధర్వుఁడు దుర్యో, ధనునిం జెఱగొన్న నతనిఁ దప్పింపఁగఁ జే
సిన నీవెట్టితనం బది, మనమునఁ దలపోయ మంట మండును నాకున్.

క॥ నీవెఱుఁగకుండఁ గీచకు, లేవిధమునఁ జంపఁబడిరి నృపః యీవిధి దు
ర్భావుల సుయోధనాదులఁ, గావలుల వధింపకునికిఁ గష్టము లబ్బెన్.

వ॥ వేయేల దుర్యోధనహితార్థంబుగా నీతనికి ధనం బొసంగుటకు నే నొల్ల నింతనిక్కువం బనిసానుజుండై భీముండు సనుటయు నది లెక్కింపక యుధిష్ఠిరుండు ధనం బొసంగి తత్తత్కృత్యంబులు నెఱవేర్పించె.

ఆ॥ వె॥ తర్పణములొసర్చి తనవారి కుత్తమ, గతులు గలుగఁ జేసి కౌర
వాధి, నాథుఁ డరిగె వనము నాతితో విదురసం, జయులతోడఁ
బూర్ణనయులతోడ. ౨౩_౨

వ॥ కుంతియు వారిపిఱుందన చనియెఁ బాండవు లాయమన్ మరలించుతలఁపునఁ దోన చని వ్యర్థప్రయత్నులై పురి కేతెంచి రంత వారలు.

క॥ పాపాపహ మగుగంగా, ద్వీపవతీతీరమున యతిప్రవరగణ
ప్రాపకమై యలరెడిశత, యూపాశ్రమమందు నుండిరుటజములందున్

వ॥ ఇట్లాఱుసంవత్సరమ్ములటఁ దపంబున నుండినపిదప యుధిష్ఠిరుం డొక్కనాఁ డనుజుల కిట్లనియె.

గీ॥ నాకు నిన్నటిరేయి స్వప్నమునఁ గుంతి, కడు బడలి యున్నవడువున
గానుపించె, నమ్మహాసాధ్వి గాంధారి ననుఁగుఁ దండ్రి, నరసి రా మన
సాయె నోయన్నలార. ౨౩౬

వ॥ మఱియు నయవిదుత్తము లగుసంజయవిదురులంగూడఁ గన మనసయ్యెడి వలసిన రండు మీరలును ననుచు వల్లె యన ద్రౌపదియు సుభద్రయునుత్తరయుఁదక్కుంగలపౌరులునుసోదరులును బలసి కొలువ న తండు శతయూపాశ్రమమ్మునకుం జని కుంతీగాంధారీధృతరాష్ట్రులఁ గని

విదురుఁగనరామికి శంకించి తండ్రితో మహాత్మా! విదురుం డెక్కడ, నని యడుగుడు ««నతండు విరక్తుండై యెయ్యెడనే యొకచోట నేకాంతంబుగఁ దపం బొనరించుచున్నవాఁ డనిన మరునాఁడు గంగాతట మెల్ల నరసి.

గీ॥ ఘోరతపమాచరించునాధీరుఁ గాంచి, ధర్మజుఁడ నని చెప్పి వందన మొనర్చి, యెదుట నిల్చిన నుత్తరం బీక మిన్న, కుండె నీగతి నొక క్షణ ముండునంత. ౨౩౮

ఆ॥ వె॥ విదురు మొగమునుండి వెడలి యఖండ తే, జం బొకం డజాత శత్రుముఖము, నందుఁ దగఁ బ్రవేశ మందెనాతండు ధ, ర్మాంశ మున జనించినట్టిఁ డగుట. ౨౩౯

వ॥ ఇట్లు విదురుండు గతాసుం డగుటకుఁ జింతించి యతనికి దహ నాదిసంస్కారం బొనర్ప నుంకించుడు నశరీరవాణి యిట్లను.

గీ॥ ఈతఁడు విరాగి గాన నీవితని కిట్టి, కృత్య మొనరింపుటకు మది నెం చఁబోకు, మనుడు ననుజులతో గంగ నతఁడు స్నాన, మాడి చని ధృతరాష్ట్రితో నది వచించె. ౨౪౦

గీ॥ మీఁద నయ్యాంబికేయుసమీపమంద, పాండవులు కొంతకాలమి ట్లుండ నటకు, వ్యాసనారదమునివర్యు లరుగుదెంచి, రనుగమించు మహామునిజనులతోడ. ౨౪౧

క॥ వ్యాసుం గనుఁగొని తగఁ గుం, తీసతి యిట్లనియె నోమునివరేణ్యా! నా,కాసజనియించెఁ గర్ణుని,నాసుతు నొకసారి గన్గొనఁ జేయఁగదే.

ఆ॥ వె॥ కన్నె ప్రాయమందుఁ గంటిని గనుఁగొంటి, నంతెకాని యతని యభ్యుదయము, చూడ నోఁచనైతి నేఁడైననొకపరి, వేగ వానిఁ జూపవే మహాత్మ. ౨౪౨

వ॥ గాంధారి యిట్లనియె.

ఉ॥ వె॥ కడుపు పగుల నింతకానుపుఁగంటిని, గాని యొకనిచేతిలోనసైన వెడల నోచనైతిఁగొడుకుల నూర్వుర, నొక్కసారిచూపు మో మహాత్మ. ౨౪౩

వ॥ సుభద్రి యిట్లనియె.

గీ॥ చిన్నతనమున వీరుఁడై వన్నె కెక్కి, తుదకుఁ గడుపునఁ జిచ్చిడి తొలఁగి
పోయె, నక్కటా! యభిమన్యు మదాత్మజాతుఁ, బ్రాణసముఁ జూపు
మిఁక నొక్కపరి మహాత్మ. ౨౮౪

చ॥ అని కరుణంబు పొంపిరిగ నయ్యమ లందఱుఁ దన్నుఁ గోర న
మ్మునివరుఁ డాత్మ నిట్లు దలపోసె జగజ్జననిన్ సనాతనిన్
సనకసనందనాదిమునిసన్నుత నున్నత దేవదేవమూ
ర్ధనిహితపాదపద్మఁ బ్రసరత్కరుణారసపూరపూరితన్. ౨౮౫

గీ॥ అష్టదిక్పాలకులును బ్రహ్మాదిదేవ, తలు నహమ్మును బంచభూతములు
నింద్రి, యాదికమ్మును లేకున్నయపుడు నొప్పు, నేజనని యాపె వీ
పని యే నుతింతు. ౨౮౬

సీ॥ దేవదేవివి మణిద్వీపవాసినివి ప్రకృతివి బ్రహ్మాదికాకృతివి సకల
జీవలోకమ్మును జిత్తమునం దిడి గుణములచే లింగకోశమందుఁ
జొనిపి సమాధినిష్ఠను జెంది కల్పపర్యంతమ్ము స్వాతంత్ర్య మనుగమించి
యుండెడినీశక్తి యొరు లెరుఁగఁగ లేరు మాదృశు లెట్లు నీమాయఁ
దెలియ; గీ॥ నేర్తు రోయమ్మ! వీర లత్యార్తు లగుచు, మృతులఁ
జూపింపు మనెదరు మృతులఁ జూప, నీకటాక్షంబు లేకున్న నే సమర్థ
తం బొరయు పాటివాఁడనా? తల్లి! చెపుము. ౨౮౭

క॥ అని సంజప్రొద్దునం దను, వినుతింపఁగ లోకజనని విస్మయగతి నా
కనివాసు లైనవారలఁ, గనుపింపఁగఁ జేసెఁ గనులకు వెడలంగన్.

వ॥ గాంధారీప్రముఖు లవ్వారిం గాంచి సంతసించిరి పిదప సత్య
వతీతనూజుండును.

క॥ వారల మరలం దివికిం, జేరం జేయుటయు నట్టిచెయిది మహాశ్చ
ర్యారోపకమై చూచెడి, వారలకు మహేంద్రజాలవైఖరిఁ దోఁచెన్.

### ధృతరాష్ట్రాదుల మరణము

వ॥ ధర్మజుండును వ్యాసున కెరఁగి సపరివారంబుగా హస్తిపురి
కేతెంచి సుఖం బున్నమూఁడవదినంబున గాంధారియుఁ గుంతియు ధృత
రాష్ట్రుండును దావానలంబుకతనఁ గాలధర్మంబుఁ జెందుటయు సంజ
యుం డంతకు మున్న తీర్థయాత్రయందుఁ గతుండగుటయు నారదునివ

లన విని దుఃఖితుండై యుచితక్రియ లాచరించె, కౌరవక్షయంబయిన ముప్పదియాఱువత్సరములకుఁ బ్రభాసతీర్థమ్మున యాదవులందఱును విప్రశాపవశమ్ముకతన మదిరాపానమత్తులై యన్యోన్యకలహమున మడిసిరి. బలరాముండును దేహత్యాగం బొనరించెఁ గృష్ణుండు శాపంబుకతనఁ గిరాతబాణతాడితుండై పరమపదం బలంకరించె వసుదేవుండు బుత్రశోకమ్మున భువనేశ్వరిఁ డెందమ్మునఁ బొందుపఱిచి పరలోకగతుండయ్యె పిదప నర్జునుండరిగి దుఃఖితుండై బలరామకృష్ణులకు సపత్నీకంబుగా సంస్కారమ్ము నిర్వర్తించి ద్వారకాపురం బుదధిచే నాక్రమింపం బడక యమున్న యంగలిజనంబులతో హస్తిపురం బరుదెంచునెడ మార్గమధ్యమ్మునం జోరులు గోపికలం గొట్టి ధనం బంతయు నపహరింప నిస్తేజుండగుకతనఁ జేయునది లేక మిన్నక యింద్రప్రస్థమ్మున కరుదెంచి యనిరుద్ధపుత్రుం డగువజ్రునకు నప్పురంబు పట్టంబు గట్టి పదఁపడి సాత్యవతేయునకుఁ గడచినవృత్తాంతమ్ము నొడివి దుఃఖించుటయు నతండు భవిష్యద్యుగమ్మున నీవును గృష్ణుండునునవతరింతు రయ్యెడ నీ తేజంబు యథాపూర్వమ్ముగ నిలసిల్లునని వచించినపిమ్మట హస్తిపురమ్ముఁజేరి యుధిష్ఠిరున కేతద్వృత్తాంతమ్ము జెప్పిన నతండు దుఃఖించి షట్త్రింశద్వత్సరుం డగునభిమన్యుసుతు రాజ్యాభిషిక్తుం జేసి భార్యానుజోపేతుండై హిమాచలమ్మున కరిగి యచట దేహత్యాగం బొనరించె నని చెప్పి సూతుండు మునులకిట్లనియె. ౨౫౦

గీ॥ ఔత్తరేయుండు పాండురాజ్యమును ధర్మ, మింతయును దప్పకుండఁగ నేలుచుండ, నరిగె నొకరీతి షష్టివత్సరము లిట్టు, లొప్పుగతి రాజ్య మేలుచు నొక్కనాఁడు. ౨౫౧

వ॥ మృగయావ్యసనమ్మున వనమ్మున కరిగి మృగంబులం బరిమార్చుచుఁ గొంతతడవు గ్రుమ్మరి విద్ధంబై పలాయితం బగునొకమృగము వెంటఁ జనిచని మాధ్యాహ్నం బగుటయు. ౨౫౨

క॥ ఆఁకలియును డప్పికయును, మేకొన నిలుపోపలేక మిక్కిలి వెతచే నాకులుఁడై యచటఁ దపశ్శ్రీకరమగు నాశ్రమంబు చేరఁ జనియెఁ.

వ॥ చని తపం బాచరించు నొకమునివరుం గాంచి జలం బడుగుడు సమాధి నిష్ఠుం డగుటఁ దన నతండు వలుకఁ డయ్యె దానఁ గుపితుండై కలిసమావేశవికలచిత్తుండై మృతసర్ప మొకండు ధనుష్కోటిం దగిల్చి యతని మెడం బడవైచి పురంబునఁ కరిగె మునియు యథాపూర్వమ్మున నిశ్చలుండై యుండె. ౨౫౪

క॥ ఆతనితనుజాతుఁడు గవి, జాతుఁడు నా బాలమౌని జనకునుకంతం బోతటి మితుఁత్రిలకతనక, బూతాత్ముఁడు విని యమర్ష పూరితుఁడగుచున్. ౨౫౫

వ॥ జలంబు కరంబునఁ ధరియించి "మజ్జనకుగళంబున నెవ్వం డీమృతసర్పంబు దగిల్చె నాదుష్టుం డేడుదినమ్ములకుఁ దక్షకదష్టుండై మృతుం డయ్యెడు మని" శాపం బిచ్చినఁ దద్వృత్తాంతంబు మునిశిష్యుం డొక్కఁడు నరేంద్రునకు విన్నవించుడు నతండును ననివార్యం బగుమునితనయుశాపమ్మునకు లికి మంత్రివృద్ధులం జూచి యి ట్లనియె. ౨౫౬

ఆ॥ వె॥ మునికుమారుఁ డొకఁడు కినలుచు శపియించె, సర్పవిషముకతనఁ జచ్చునట్లు, గాన దాని దాఁట గాఁ గలయొక్కయు, పాయ ముండెనేని బ్రతుకు గలదు. ౨౫౭

గీ॥ మృత్యు వెన్నటికైనను నిత్యమైన, దైనఁ బౌరుషయత్నంబు మాన దగద, టంచుఁ బెద్దలు వచియింతు రరసి యిపుడు, తగినయత్నం బొనర్పఁగాఁ దగదె మనకు. ౨౫౮

వ॥ మణిమంత్రౌషధప్రభావమ్ము లగణ్యంబులు ము న్నొక్కమునివరుభార్య సర్పదష్టయై యమ్మునియాయువునం గర్ధమ్ము గొని పునర్జీవిత యయ్యె నని విందు మిట్లు ప్రత్యక్షదృష్టాంతమ్ము లనేకమ్ము లుండ నౌదాసీన్యంబున మిన్నకుండు టయుక్తంబు, సర్వంబు దైవాధీనం బని యెవ్వండు నిరుద్యోగి యగు నతం డలసుండు నాఁబడు. ౨౫౯

క॥ దైవాధీనమటంచును,గేవల మూహింపఁదగదు గృహిభిక్షుకకుం బా వాత నన్న మిడుఁగా, కావలద్రింగుటకు నతనియత్నము వలదే.

వ॥ అనుపరీక్షిత్తుం గాంచి మంత్రులు మహాత్మా! సర్పదష్ట
యైనమునిభార్య పునర్జీవిత యయ్యె నని నుడివితి వాపె యెవ్వతె యేక
తమ్మున సర్పంబు గఱచె మా కెఱింగింపుము నావుడు రా జిట్లనియె.

## ప్రమద్వరావివాహము

సీ॥ మంత్రులారా! పులోమ యనెడిభృగుభార్య కుదయించెఁ జ్యవనుఁ
డత్యుగ్రమూర్తి, యతనికి శర్యాతి యనుఁగుఁగూఁతురు సుకన్యాసతి
భార్యయై యలరె నాపె, యందుఁ బ్రమతి యనునందనుఁ డుద
యించె నతనిభార్య ప్రతాపి యామె కొక్క, రుఁడు గొమారుఁడు
పుట్టె రురు వనువాఁ డతండత్యుగ్ర మగు తపం బాచరించె; గీ॥ నయ్యె
వసరమునంద మాన్యమతి స్థూల, కేశుఁ డనుమహానియును హృషీ
కేశుఁ డగుచుఁ, దపము సల్పుచు నుండెనత్తఱిని మేన, కయును
విశ్వావసుకతన గర్భ మంది. ౨౬౨

క॥ అలస్థూలకేశునాశ్రమ, తలమున కేతెంచి యొక్క తనుజఁ జగతీ
తలమునఁగలకన్నెలకుఁ, దలమానిక మగుచుఁదనరుదానింగనియెన్

క॥ బిడ్డం గని యట నొకనది, యొడ్డున నక్కూఁతు విడిచి యుగ్మలిచని
యెఁ, గొడ్డుదినా ఱలంజెలకుం, బిడ్డలు తెవు" లన్నపలుకు వృథ
వోకుండఁ. ౨౬౪

క॥ ఆపసిబిడ్డం గని యా, తాపసి తా నెత్తి పెంచి దానికిఁ బేరుం
బ్రోషించెఁబ్రమద్వర నా, నాపాపయు వృద్ధిచెందియంతఁ గ్రమమునన్

క॥ సుమశరునిబాణమో నాఁ, గొమరారుచు మిగుల వలపుఁగొలుపుచు
దృఙ్మా, ర్గమునం బడ నారురువుం, బ్రమద్వరం గాంచి కామబాణా
ర్దితుఁడై. ౨౬౬

క॥ తనయాశ్రమమునకుం జని, యనుగతచింతాభరార్తుఁడై యొక్కెడ సు
ఖ్ఖునివిధమున నున్నరురుం, గని జనకుం డడుగ నతనిఁ గని యాతఁ
డనియెన్. ౨౬౭

గీ॥ స్థూలకేశుం డనెడిమునీశునివసమున, వఱలు నొకచంద్రముఖి ప్రమ
ద్వర యనంగ, నాకునక్కన్నెమిన్న యందంబు గనిన, యది మొదలు
భార్యగాఁ గొన నాస పుట్టె. ౨౬౮

వ॥ అనుడుఁ బ్రమతియు నయ్యాశ్రమమ్మునకుం జని నమ్మునికి నమస్కరించి ప్రసన్నుఁగాఁ జేసికొని యక్కన్నియం దనతనయున కిమ్మని ప్రార్థించుటయు. ౧౧౯

గీ॥ ఆతఁ డంగీకరించె ననంతరంబు, వార లిరువురుఁ గలసి వివాహము నకుఁ, దగినయత్నం బొనర్చిరి తదవసరము, నంద సర్పమ్ము గఱచె నయ్యబ్జముఖిని. ౧౨౦

గీ॥ అంతకంతకు విష మెక్కి యన్వరాంగి, ప్రాణములు వీడి పరలోక మనుగమించె, నంత మును లందఱును జేరి యార్తు లగుచుఁ, జింత చేసిరి చేసెడిసేఁత లేమి. ౧౨౧

వ॥ రురువు నవ్వార్త విని యట కరిగి యామృతకళేబరముం జూచి దుఃఖార్తుండై కొంచె మావలకుం జని యిట్లు విలపించె. ౧౨౨

క॥ నాదుసుఖమునకు విఘ్నా,పాదకుఁడై యిట్లొనర్చెఁ బాపువిధి నా గాదిలి నామతి నాధృతి, నాదగుజీవితము పోయెనా! యకటకటా!

సీ॥ దొాదవ్వులన చూచి మోదమందితిఁగాని దరిఁ జేరి మాటాడఁ దలఁప నైతి, మోము నాలోకించి మురిసి మించితిఁగాని కెమ్మోవిరుచు లార గించనైతి, కులుకుగుబ్బలు గాంచి యులుకుఁ జెందితిఁగాని చెలి నొక్కపరి యక్కుఁ జేర్ప నైతి, మేనికాంతికి మిఱుమిట్లు గొంటినిగాని యంగననంతగానరయనైతి; తే॥గీ॥ పాణిమాత్రగ్రహణమైనఁ బడయ నైతిఁ,బరమపాపికి నాకట్టి భాగ్యమెట్టు, లక్కటా! దైవ మేటువంటి చిక్కు దెచ్చె, జీవితం బేల ప్రియురాలిచావుగంటి. ౧౨౪

క॥ చనుమా! జీవనమా! యిఁక, ననుమానం బేల! నీకునఖిలవిధములఁ జనుమాన మొసఁగఁ దగుచెలి, కనుమాసెను దానికన్న ఘన మయ్యెదవే. ౧౨౫

చ॥ జలమునఁ బోదువో యనలసంగతిఁ బోదువొ ఘోరపాశముఁ గళమునఁ బూనిపోయెదవొ కా దిది తప్ప దలంచినాఁడ నా వలపులదీవి తా విషమువల్ల మృతిం గనినప్పు డీవు న ప్పొలఁతుకవోవుమార్గమునఁ బోదగు నెమ్మెయి నట్లొనర్పుమా.

వ॥ అని మఱియును.

ఆ॥ వె॥ చచ్చుమీఁద నేమిసాధింపఁ దగుజీవి,తమ్ము గల్గుపై సుఖమ్ములబ్బుఁ
దరలి పోవఁ దల్లిదండ్రులు చింతింత్రు, గాని దైవమునకుఁ
గరుణ గలదె. ౨౭౭

క॥ ఒకవేళ నాదుమరణము, నకు నెల్లరు సమ్మతించినను నాప్రియు రా
లికి నేఁ బరలోకమున నుపకార మే మాచరించువాఁడ మృతుఁడనై.

గీ॥ ఆత్మహత్య నొనర్చి యే నటకు నేగఁ, బాతకుం డని యచ్చెలి పరి
హరించు, "వెనుక కేగిన నూయి ముందునకుఁ జనిన, గోయి" య
క్కట! యే నేమి సేయువాఁడ. ౨౭౯

వ॥ ఇట్లు విచారించుచునమ్మునితనయుండు గృతస్నానుండై యం
జలిపుటమ్మున జలంబులు గొని. ౨౮౦

ఉ॥ ఇంచుకయేనిఁ బుణ్యాలవ మే నొనరించితినేని గౌరవా
భ్యంచితు లైనవారలకు భక్తుఁడనేనిఁ దపఃప్రసక్తిఁ గా
వించితినేని వహ్నులను ప్రేల్చితినేనిఁ ద్రయీప్రపత్తి మై
మించితినేని యిక్కలికిమిన్న దటాలున లేవ కుండునే. ౨౮౧

గీ॥ లేవకుండిన జీవనం బేవగింతు, ననుచుఁ గృతనిశ్చయుం డయి ముని
సుతుండు, కరగతం బగుజలమును ధరణి విడువఁ, బోవునాయంతలో
నొక్క దేవదూత. ౨౮౨

ఆ॥ వె॥ రోదనం బొనర్చురురునియొద్దకు వచ్చి, యేల! చింతఁ గొనెద
వేల యింత, సాహసం బొనర్ప సమకట్టి దయ్యయో!, చచ్చి
నట్టికాంత నచ్చు టెట్లు? ౨౮౩

క॥ కావలసిన మఱియింకొక,పూవుంబోడిం గ్రహింపఁ బోలదె? మరణం
బేవారు తప్పఁ ద్రోయుదు,రో వెఱ్ఱిమునీంద్ర! చింత నొందఁగఁదగునే

వ॥ అనునతని కతం డి ట్లనియె.

ఆ॥ వె॥ బ్రతికెనేని దీనిఁ బాణిగృహీతిగాఁ, జేసికొనెద బ్రతుకుఁ జెంద దేని
దీనిలోకమునక యేనును బోయెదఁ,గానియింక నొక్క కన్నె నొల్ల

వ॥ అనవుడు దేవదూత యతనినిశ్చయ మ్మవంధ్యమ్మని యెంచి
మునీంద్రా! దేవకల్పితం బగునొక్కయుపాయం బెఱింగింతు నీయా
యువునం దర్ధ మిడఁ గలవేని యిక్కన్నె పునర్జీవిత యగు ననిన నతండు

వ్వాలై యని యట్లు సేయ నుంకించుడు విశ్వావసుండును దనపుత్రి మృత యగుటఁ దెలిసి యట కేతెంచె నంత దేవదూత యతనిం గలసి యము నిపాలికిం జని యి ట్లనియె. ౨౮౬

ఆ॥ వె॥ ధర్మరాజ! రురునితరుణి, ప్రమద్వర యితనిపుత్రి విషముకతన మృతిని, జెందె రురుఁడు మృతిని జెందఁగ నున్న, వాఁ డతని యాయువందు నర్థ మొసఁగి. ౨౮౭

క॥ బ్రతికింపు మిత్త్రలోదరి,నతిరయమున ననుడు ధర్ముఁ డట్టులె యాపెన్ బ్రతికించిన నక్కన్నెన్,సతిగాఁ గైకొనియె రురుఁడు సంతసమొసఁగన్. ౨౮౮

చ॥ ఇటు సదుపాయయోగముననే కద! జీవన మావహించె న చ్చటులమృగాక్షి కట్లగుట సాధ్యముగాఁ గనుపట్టుడన్న స ప్పటి కనుకూలమై తగునుపాయములన్ మణిమంత్ర ముఖ్యసం ఘటనములన్ బొనర్చుటయ కర్జము ప్రాణమురక్షసేతకున్. ౨౮౯

వ॥ అని చెప్పి సచివానుమతమ్మున సాప్తభూమికం బగుప్రాసాదం బొక్కండు నిర్మించి యందు మంత్రులతో వసించె. ౨౯౦

గీ॥ దానిచుట్టును మణిమంత్రధరులు శూరు, లును నయినవారు కాఁ పుండి జనవరేణ్యుఁ, గాచుచుండిరి నృపతి యక్కడన భోజ, నాదికంబులు నెఱవేర్చునట్టియెడల. ౨౯౧

గీ॥ కశ్యపుం డనునొకమునికాంతుఁ డర్థి,యగుచు నేతెంచె శాపోపహతు నృపాలుఁ, దనదుమంత్రబలమ్మునఁ దక్షకవిష, ముక్తుఁ గాఁ జేసి తగ ధనమ్మును గ్రహింప. ౨౯౨

వ॥ మార్గమధ్యమ్మున వృద్ధబ్రాహ్మణస్వరూపుండై తక్షకుం డరు దెంచి నీ వెందుల కేకతమ్మున నరిగె దని యడుగుడుఁ దక్షకోపహతుం డగుపరీక్షిత్తు బ్రతికింపం బోయెద ననిన నతండును, ౨౯౩

గీ॥ తక్షకుండను నేనె యాతనిని గఱచు, వాఁడ మద్విషనిహతుల బ్రతుకఁజేయ,మంత్రముల్ గింత్రముల్ మహిమఁ గనఁజాల,వింత నిక్కువ మీకష్ట మేల! చనుము. ౨౯౪

గీ॥ అనినఁ గశ్యపుఁ డిట్లను నస్మదిష్ట, దేవతాప్రాప్తమంత్రప్రభావగరిమ
బ్రతుకఁ జేసెదఁ ద్వద్విషబద్ధు మునికు, మారశాపోపనిహతుని నమ్మ
నుజవిభుని. ౨౯౭

క॥అనుడు భవదీయశక్తిం,గనుఁగొందుంగాక యనుచుఁ గఱచెం దంష్ట్రిల్
చొనిపియొకమఱ్ఱిచెట్టున్,మునిసూచుచునుండభస్మముగఁదక్షకుఁడున్

వ॥ కశ్యపుఁ డద్దానిం బోగ్రపుచేసి మంత్రబలమ్మున యథాపూ
ర్వమ్ముగా నొనర్చిన నక్కజంపడి యతం డతని కిట్లనియె. ౨౯౮

క॥ మెచ్చితి నీమంత్రమ్మున, కచ్చెరువుం జెందితిని మహాత్మ! యిపుడు నీ
వచ్చోటి కరుగుకార్యము,పొచ్చెములేనిగతిఁబేర్మిపొసఁగం జెపుమా.

వ॥ అనుడుఁ గశ్యపుం "డస్మన్మంత్రవిద్యాపాటవమ్మున నతనిం
బ్రతికించి ధనంబు సంపాదింపం బోయెద" ననిన నతండు నీవలసినధనం
బే నీ నోపుదు నిచ్చెదఁ బుచ్చికొని మరలు మనుడు నతం డిట్లుయోజించె.

గీ॥ మునుహరిశ్చంద్రుఁడును రఘుభూమిపతియుఁ, గర్ణుఁ డాదిగఁ గలధ
రాకాంతు లఖిల, ధనము యశముకై విడిచినది వినమె, యశము
నకుఁ గాని ద్రవ్యంబు వ్యర్థ మరయ. ౩౦౦

గీ॥ మంత్రిబలమున నమ్మహీమండనునకు, జీవితంబు నొసంగినఁ జెప్పి
కొందుర్రి, ధనముఁదుంగల్గుఁ బ్రజలకు జనవరుండు, గల్గు రాజ్యమ్ము
నకు మేలు గల్గుఁ దలఁప. ౩౦౧

ఆ॥ వె॥ లోభగుణ మొకండు లోన నూనితినేని, రా జడంగు మీఁద
రాష్ట్ర మడఁగుఁ, బ్రజయు నాశ మందుఁ బాపంబు ననుఁజెందు
నపయశం బవార్యమై పొసంగు. ౩౦౨

వ॥ అని తనలోఁ గొంతతడవు విచారించి దివ్యదృష్టిం గాఁగల
తెఱం గెఱింగి తక్షకదత్తం బగుధనంబు సంగ్రహించి మరలి చనియెఁ
దక్షకుండు సప్తమదివసమ్మున హస్తిపురికిం జని నృపతి దుర్గమప్రదేశ
మ్మున నుంటయు మణిమంత్రౌషధజ్ఞులచే రక్షింపఁ బడుచుండుటయుఁ
గని యిట్లు వితర్కించె. ౩౦౩

శా॥ ఏరూపమ్మున లోని కేగుదునొ యే నేరీతి వంచింతునో
కౌరవ్యాన్వయమందుఁ బాతకములం గావించు వాఁ డీతఁ డీ

దూరాజుఁ జేమియింతునే సుజనసంతోషమ్ము వాటిల్లునే?
ప్రారంభించినకార్య మియ్యది యొనర్పం జెల్లునో చెల్లదో. ౩౦౪

గీ॥ గర్హితం మొనర్చియును గాలగతి నెఱింగి,రక్షకులు చుట్టువార హర్మ్య
మ్మునందు, మృత్యువును దాఁటునిచ్ఛమై మెలఁగుచుండెఁ, గాని యని
వార్య మని యెఱుంగఁ డితఁ డకట! ౩౦౫

గీ॥ కోటియత్నము లొనరించుకొనినఁగాని, దైవకృత మగుమృత్యువు
దాఁటఁ దరమె, యంతకన్నను దానధర్మాదికమ్ము, చేసికొనరాదె
యం దైనఁ జెందు సుఖము. ౩౦౬

గీ॥ విప్రశాపమ్ము తప్పునే? వెఱ్ఱిఁబడక, యతిరయమ్మున దానధర్మాదికంబు
చేసికొను మని యొకఁడైనఁ జెప్పఁ డకట!,విప్రు లున్నారు సన్నిధి
వేనవేలు. ౩౦౭

వ॥ అని తనకడనున్న సర్పమ్ములం గాంచి మీరు విప్రవేషమ్ముల ఫలమూలాదులు గ్రహించుకొని రాజదర్శనంబునకుం బొం డని తా నొకకీటరూపమ్మునఁ దత్ఫలమ్ముల నొదిగి యుండె వారును రక్షకులం గాంచి యేము కురుకులాభరణం బగుపరీక్షిత్తు రక్షింప వచ్చితిమి గాన మీరాజునకుం దెలుపుఁడు నావుడు వారిది సమయంబు గాదు విప్రశాపభయమ్మున నృపాలుం డేకాంతం బగుదుర్గంబు నున్నవాఁ డట కేరి కిం జన నశక్యంబు రేపకడ రం"డనుటయు. ౩౦౮

క॥ భారతకులమున మున్నెపు, డారయ మిటు ద్వారమందు నభ్యంతర
ముల్,ధీరులగు విప్రవరులకు, నీరాజన్యుని ప్రభుత్వ మిదిగల్పించెన్.

క॥ అనవుడు నృపుతోఁ జెప్పిరి, విని నరపతి వారి కేను వినయమున నమ
స్సొనరించి రేపువచ్చుట,కును బ్రార్థించుట వచించికొనుఁడుఫలాదుల్

వ॥ పదఁపడి దౌవారికు లట్లొనర్చిరి రాజు తత్ఫలమ్ములు వేఱు వేఱమంత్రుల కొసంగి కాలవశమ్మునఁ దక్షకాధిష్ఠితం బగుఫలంబు దాను భక్షింపుటకుఁ జిదుముటయు. ౩౧౦

క॥ అరుణమును గృష్ణదృగ్భ్య,కరమును నగు కీటకంబు గనుపట్టఁగ న
చ్చెరు వంది పరీక్షిన్నర, వరుండు తనమంత్రివరులవంకం గనుచున్.

ఆ॥ వె॥ అరుణుఁ డస్తగిరికి నరుగుచునున్నాఁడు,తక్షకార్తి యింక దాఁటి
పోయె, విప్రతనయుమాట వితథ సేయఁగా రాదు, గానఁ గీట
మిదియ కఱచుఁగాత. ౩౧౩

వ॥ అని యప్పూరువుం దనగళమ్మున నిడికొనిన నయ్యది భయం
కరంబగుతక్షకస్వరూపమ్ము ధరియించి చుట్టికొనియె నంతఁ బరుగిడువా
రును నచ్చెరువందువారును హాహాకారమ్ములొనర్చువారునై యెల్లరును
చెల్లాచెదరైరి మహీపతియు దుర్వారతక్షకభోగిభోగావృతగళుం డగుచు
మిన్నకుండె. ౩౧౪

క॥ తత్తక్షకవదనవిని, ర్యత్తీవ్రవిషానలంబు రాజన్యు మహో
ద్యత్తాప మడరఁ బొరిగొనె,నత్తాపసుశాప మదియథార్థము గాఁగన్.

వ॥ ఇట్లు పొలియఁజేసి తక్షకుండు గగనమార్గంబునఁ దన
యిచ్చం జనుడు మంత్రులు పురోధఃపురస్సారంబుగా నతని కౌర్ధ్వదైహి
కంబు లగుకృత్యమ్ములు నెఱవేర్చి. ౩౧౬

క॥ జనమేజయు శుభలగ్నం, బున రాజ్యమ్మునకుఁ బట్టముం గట్టి కన
త్కనకమణిమండితం బగు, ఘనసింహాసనము నెక్కఁగాఁ జేసి రొగిన్.

జనమేజయునకు రాజ్యప్రాప్తి

గీ॥ రాజచిహ్నాంకితుఁడు జనమేజయుండు, క్రమముగా దాది శిక్షలు
గఱపుకతన, నిపుణుఁడై వర్ధమానుఁడై నేర్చె రాజ్య, తంత్రముల
నెల్ల మంత్రిసత్తములు పొగడ. ౩౧౮

గీ॥ అంత నేకాదశాబ్దంబు లరుగు సమయ, మునఁ బురోహితుఁ డానృ
పపుత్రకునకు, వేదవేదాంగములు ధనుర్వేద మాది, యగుసకల
విద్యలును నేర్పె నతిరయమున. ౩౧౯

గీ॥ సకలవిద్యలు నేర్చి యాజనవరుండు, క్షితిని బాలించె ధర్మరా జతఁ
డనంగ, నతని కిడియె సువర్ణవర్మాఖ్యుఁ డనెడి, కాశిరాజు వపుష్టమా
ఖ్యాకఁ దనయ. ౩౨౦

వ॥ ఇట్లు కాశిరాజసుతం బైకొని పులోమజం జేకొన్న నిందుఁడు
నా సమస్తసుఖమ్ము లనుభవించుచు రాజ్యం బొనర్చుచున్నంత. ౩౨౧

క॥ తత్తక్షకపరిభూతిం, జిత్తమెఱియ బదులుసేత సేయింపంగా
నుత్తంకుం డనునొకముని, దత్తఱమున నేగుదెంచె దంతినగరికిన్.
వ॥ వచ్చి జనమేజయుం గాంచి యిట్లనియె.
ఉ॥ ఎప్పుడు చేయునట్టిపను లెయ్యవియో యెఱుఁగంగ లేవు నీ
విప్పటిచిన్ని బాలకుఁడ వేమనువాఁడ! నమాత్యు లైన నీ
కొప్పిద మైనకార్యముల నొప్పవెగఁ జెప్పరు తప్పుకార్యముల్
చొప్పడుఁగాని పిన్నలకుఁ జొప్పడునే? విహితప్రచారముల్. 3_23
వ॥ అనుడు వినయమ్మున నాయకృత్యంబును గర్తవ్యంబు నెఱిం
గింపవే యన జనపతి కిట్లనియె. 3_24
క॥ నీతండ్రిం బరిమార్చిన, యాతక్షకునెడల వైర మణుమాత్రమ్ముం
జేతోగతిఁ దలపోయవు, నీతియె యిది నీకు ధారుణీవరతిలకా.
వ॥ ఈయుదంతంబు నీ వెఱుంగవేని నీయమాత్యులం బిలిచి
యడుగు మనుడు వా రున్నయున్కి నెఱింగించిన. 3 25
క॥ జనమేజయుఁ డిట్లను నో, మునివల్లభ! విప్రశాపమున మృతి గనె మ
జ్జనకుఁడు, తక్షకుపై మన, మనిమిత్తం బైనవైర మందం దగునే.
గీ॥ అనినఉత్తంకుఁ డిట్లను నధిప! తప్పు, దలఁచుచున్నాఁడ వేమనఁ! దక్ష
కుండు, ధన మొసఁగి కశ్యపుని మరల్చినకతమునఁ, జచ్చె నీతండ్రి
లేకున్కిఁ జిచ్చువాఁడె. 3_27
వ॥ తొల్లి రురు వనునొకముని తనభార్య సర్పదష్టయై మృతిం
గనుడుఁ దనయాయువునసర్ధం బొసంగి పునర్జీవితం జేసి ప్రీతినంబుగానె
నది యెట్లంటేని. 3_28
క॥ కాకోదర మేదేనియు, నాకంటం బడియె నేని నాశ మొనర్తుం గా
క యని దండమొక్కటి, గైకొని దేశములు తిరుగఁగాఁ జనియెనృపా.
వ॥ ఇట్లు దేశమ్ములం గ్రుమ్మరుచుఁ గనుపట్టినంతవట్టును సర్ప
మ్ములఁ బరిమార్చుచు నొక్కయరణ్యమ్మున ముదుసలికొండచిలువం గాంచి
వధింప నుకించుడు నది మనుష్యభాషణంబుల నిట్లనియె. 330
క॥ నాచేసినత ప్పేమి! య, యో! చంపఁగ నేమి వచ్చెనో? తెల్పు మటం
చాచిలువరాజు వేడిన, నాచతురాననకులీనుఁ డాగ్రహ మొనయన్.

క॥ నీజాతిసర్ప మొక్కఁడు, నాజాయం గఱచుకారణంబునఁ గోపో
ద్వేజితుఁడ నగుచు సమయం, బేఁ జేసితి సర్పజాతినెల్ల హరింపన్.

వ॥ అనుడు డుండుభమ్ము నే నెవ్వరిం గఱవఁగల దానఁ గాను గఱచు భుజంగమమ్ము లవి వేఱు, దేహసామ్యంబునం జేసి నన్నుం జంపఁ బోకు మనపరాధుల దండించుట ధర్మ వే? నావుడు నద్దానిమనుష్యభాష ణంబులకు సంతసిల్లి నీ కీజన్మం బెట్లు ఘటించె నుడువు మన నది యిట్లనుఁ దొల్లి యేను బ్రాహ్మణుండ ఖగముఁ డనునొక్క ధరణీసురుండు నాకు మిత్రుం డతని నొక్కనాఁడు తృణమయం బగుసర్పంబు నొనర్చి జంకించితి నతండు భయంపడి యగ్నిహోత్రగృహమ్మున డాఁగి వేపమా నుం డగుచు "సర్పంబ వగు" మని నన్ను శపించె నది నిమిత్తంబుగ నేను సర్పంబనై "నాయపరాధంబు సైఁపు" మని వేఁడినఁ "బ్రమతిపుత్రుం డగు రురునివలన నీకు శాపమోక్షణం బగు" నని యనుగ్రహించె "నాతండవు నీవకా" యని తలంచెద ననుం గరుణింపవే? యనుడు రురువును న ట్లొన ర్చినపిదప స్వస్వరూపమ్మున నతం డి ట్లనియె.                33౪

క॥ రురుమునివర! పాముల నిఁకఁ, బొరయం జేయకుము పరమముని లకు యజ్ఞేతరకార్యముల "నహింసా, పరమో ధర్మ" యని ధర్మ పద్ధతి కాదే.                33౫

వ॥ అనుడు నదిమొదలు రురు వక్రకృత్యంబు విడిచె నీవు క్షత్రి యుం డ వయ్యు బ్రాహ్మణునిపాటిద్రైన వైరంబు సాధింప నైతి.   33౬

క॥ పితృవైరము దీర్పనిదు, ర్మతులకు సద్గతులు లేవు రాజేంద్రా! య ప్పతితుఁడు బ్రతికియుఁ జచ్చిన, గతి వాఁడే తండ్రి నరకగతుఁడగుకతనన్

ఉ॥ కావున నీదుతండ్రికి సుఖం బగుసద్గతి గల్గు నట్లుగా
భూవర! సర్పయాగమును బూని యొనర్చి సమస్తసర్పవి
ద్రావము చేసి వైరముకరంబు తిరంబుగ నిర్వహింపు మ
ద్దేవికిఁ దృప్తిగా ననుమతింపుము మద్వచనంబు నావుడున్.   33౭

క॥ జనమేజయుండుఁ దనజన, కునిదుర్మరణమున కడలుగొల్పుచుఁ గనులం గొనకొని బాష్పము లొలుకఁగ, మనమునఁ జింతించె మాటిమా టికి నిట్టుల్.                33౮

క॥ ఏనాయనునఁగుంజనకుఁడు,ప్రాణములం గోలుపోయెఁ బాముకతన న
    ద్దానికి బదు లొనరింపని, యీనాజన్మంబు కాల్పనే? యేమిటికిన్.
    వ॥ అని సంజాతక్రోధుండై మంత్రుల రావించి యిట్లనియె.
ఉ॥ ఆగడ మూని మజ్జనకు నత్యమలున్ సుగుణాంచితున్ మహా
    భాగు వధించినట్టిఖిలపన్నగజాతిని బట్టి యంబికా
    యాగమిషమ్మునన్ హుతవహజ్వాలదుగ్రశిఖాపరంపరం
    గ్రాఁగఁగఁ జేసి ధన్యతను గాంచి పితృణవిముక్తిఁ జెందెదన్.
ఉ॥ అంకితుఁ డైనతక్షకుఁడు యాగపశుత్వము గాంచునంట! యు
    త్తంకుఁ డశంకితుం డగుచు దానికి హోతృతఁ గాంచునంట! రు
    ట్పంకిలచిత్తుఁ డైనజనపాలకుఁ డీజనమేజయుం డనా
    తంకుఁడు కర్తయంట! ఘనతన్ జగదంబ ముదంబుఁ జెందదే.
క॥ పిలువుఁడు భూసురవర్యుల, సలుపుఁడు యజ్ఞార్థ మైనసంభారమ్మున్
    నిలుపుఁడు గంగాతీర, స్థలమున నొకశాలయున్ శతస్తంభమునన్.
    వ॥ మంత్రులును యజ్ఞసంభారమ్ములు సన్నద్ధపఱచుడు నుత్తంక
పురస్సరంబుగా వేదవేదాంగాదిపారగు లగువిప్రులు ఋత్విక్కులుగా సర్ప
యాగం బొనర్పనెడఁ దక్షకుం డిందుప్రాలికిం జని శరణంబు వేఁడిన
నిందుఁడ్రిం డభయం బొసంగి తనయాసనమ్మునఁ గూర్చుండఁ బెట్టికొనుడు
నంత నుత్తంకుండును. 3౪౪
క॥ అనుగతకోపభరమ్మునఁ,గనలుచు ను "సహేంద్రతక్షకాయ స్వాహా"
    యని యభిమంత్రించిన భయ, మున వాఁడాస్తీకుఁ డనెడిముని
    సఖుఁ దలఁచెన్. 3౪౫
క॥ అకలంకుండు జరత్కా, రుకుమారుడు మానిజనవరుఁడు యోగ్యుఁడు త
    క్షకహితుఁ డాస్తీకుఁడురా,జకుమారునిజన్నమునకుఁజనుదెంచె వెసన్
    వ॥ జనమేజయుం డమ్ముని నర్చించి భవద్వాంఛితం బే మని యడు
గుడుఁ దక్షకహితం బాచరించువాఁడై యిమ్యాగంబు విరమించుటయ
మదభీష్టం బనుడు సత్యసంధుం డగుజనమేజయుం డాజన్నంబు విరమించి
పదఁపడి సాత్యవతేయశిష్యుం డగువైశంపాయనునివలన మహాభార
తంబు వినియె. 3౪౬

క॥ వినియుం దృప్తిం జెందక, జనమేజయనృపతి వ్యాససంయమివరునిం
గనుఁగొని యిట్లను "యనఘా!, మనమునకుఁ శాంతిగల్గుమార్గము
సెప్పుమా! ౯౮౭

గీ॥ క్షత్రియుం డగువానికి సంగరమునఁ, గాని గృహమునఁ గాని యుక్త
మగురీతి, మరణ ముత్తమ మారీతిమరణ మబ్బ, దయ్యెమజ్జనకునకు
సౌఖ్యంబు కలదె. ౩౮౯

క॥ కావున మజ్జనకునకు సు, ఖావిర్భావంబు పరమునం దొదవ యశ
శ్శ్రీ వర్ధిల్లఁగ సదుపా, యావహ మగుదాని నాకు నానతి యీవే.

వ॥ అని ప్రార్థించుజనమేజయునకు సత్యవతీతనుజుం డిట్లనియె.

ఉ॥ పాపహరంబు మోక్షదము భద్రకరంబు పురాణరత్న మ
ధ్యాపకశిష్యనిత్యసుఖదం బగుభాగవతంబు మత్సుతుం
డోపి పఠించె నయ్యది మహోత్తమ మాగమసార మాత్మసం
తాపహరంబు దాని వినినఁ దుదముట్టు సమస్తముఁ నృపా.

వ॥ జనమేజయుం డద్దాని నా కెఱింగింపు మని మఱియు నిట్లనియె

గీ॥ అనఘ! యాస్తీకుఁడ ననెవ్వఁ డతని నెవఁడు, గన్న వాఁడు! మహాత్ముఁ
డేకారణమున, నస్మదీయాహియాగంబు నాఁగె నతఁడు,దగఁ దెలిపి
మీఁద భాగవతంబుఁ జెపుమ. ౩౯౨

వ॥ వ్యాసుం డిట్లను జరత్కారు వనునొకముని దారపరిగ్రహం
బొల్లక యస్ఖలితబ్రహ్మచర్యవ్రతంబు పూని యున్నంత నాతనిపితరులొ
క్కవనమ్మునం దొక్కెడ నొకగర్తమ్మున వ్రేలుచుం గనవచ్చి యిట్లనిరి. ౩౯౩

క॥ దారం బరిగ్రహింపుము, నారకబాధాపనోదు నందనుఁ గని మ
మ్మారాధింపుము స్వర్గ, ద్వారకవాటమ్ము విప్పఁదలఁపుము నాఁగన్.

ఆ॥ వె॥ నా కయాచితముగ నాపేరు గలయట్టి,కాంత దొరకెనేని గార
వించి, పెండ్లి చేసికొనెదఁ బెఱరీతు లిఁక నొల్ల, ననుచుఁ దీర్థ
యాత్ర కరిగె నతఁడు. ౩౯౫

వ॥ ఇది యిట్లుండ నొక్కెడ గశ్యపునిభార్య లగుకద్రువయు విన
తయు ననువార లాదిత్యరథాశ్వంబుం గనుంగొని నలు పనియుఁ దెలు
పనియుఁ గొంతవడి చర్చించి యిట్లు పణబంధంబు సల్పికొనిరి. ౩౯౬

గీ॥ నలుపయిన నాకు దాస్యంబు సలుపు మీవు, తెలు పయిన నీకు దాసినై కొలుతు నేను, వాద మిట్లొనరించి యవ్వనిత లిటి, కరి గి యాథార్థ్యము మఱునాఁ డరయ నెంచి. ३४८

వ॥ ఆనాఁటిరాత్రి కద్రువ తనయు లగుసర్పములం బిలిచి రవిరథా శ్వరోమంబుల నాక్రమించి కృష్ణవర్ణంబులుగా నొనర్పుఁడని యాజ్ఞాపిం చిననంగీకరింపనివారిం గొందఱి జనమేజయయాగహుతాశనమ్మునం బడుం డని శపియించెఁ గొంద ఱా శాపమ్మునకుఁ దలఁకి శ్వేతవర్ణం బగునవ్వా రువంబును గృష్ణవర్ణంబుగా నొనర్చిరి మఱునాఁ డా సవతు లిరువురు నట కేగి హయమ్ముం జూచునంత నల్లనై యున్నవినత యోడి విన్ననై యప్పకు దాస్యం బొనర్చుచుండెఁ గొండొకకాలమ్మునకుఁ గద్రువ తన్నును దనకుమారులను వీఁపున నెక్కించుకొని మోయు మనవుడు శోకార్తయగుచుఁ గుందుచున్నతల్లిం జూచి గరుడుం డిట్లనియె. ३४౮

క॥ రవిసారథి యరుణాహ్వయుఁ,డవిరళబలశాలి యగుమదగ్రజుఁడుండన్ నవయఁగ నేటికి? నే నుం, డ వచింపుము శోకకారణము నాతల్లీ.

ఆ॥ వె॥ తనయు లున్నతల్లియును పెనుదుఃఖంబు, పొందెనేని వారు పుట్టనేల?, శోకకారణంబు నా కెఱిఁగింపుము, వేగదీర్తు నన్న వినత పలికె. ३६०

క॥ ఏమని చెప్పుదుఁ దండ్రీ!, స్వామినిగద! నాకు సవతి సతతంబే నా భామినికి దాసి నాపెఁ,దా! ‹‹మోయుము నన్నటంచుఁ దరుణి విధించెన్. ३६౧

వ॥ అని దుఃఖించుతల్లికిఁ గొమరుం డిట్లనియె.

క॥ అమ్మా! నీబదులుగ నే,నమ్మానిని మోయువాఁడ నడలకు మిఁక నం చమ్మానశాలి సుతసహి,తమ్ముగ నమ్మగువ భుజగతయయి చెలంగన్.

వ॥ మోయువాఁడు సముద్రతీరమ్మున కరిగి పెదతల్లికి వినయ మ్మున మ్రొక్కి యిట్లనియె.

క॥ తల్లీ! నీదాస్యము మా, తల్లికి నేరీతిఁ బాయు దయఁ దెల్పు మటం చల్లన మ్రొక్కుడు గరుడున,కల్లలన విధించె నమృత మర్పించుటకున్.

క॥ గరుడుం డెంత యటంచు న,మరలోకం బరిగి బాహుమదమడర
సుధా, పరిపూర్ణం బగుకుంభ మ, మరుల గెలిచి తెచ్చె గగనమా
ర్గానుగతిన్. ౩౬౪

వ॥ తెచ్చి యయ్యమృతకుంభంబు పెదతల్లి కప్పగించి తల్లిదా
స్యంబువాపె నంతం దద్భక్షణార్థంబు కాద్రవేయులు స్నానం బొనరింప
నేగు నీలోన నిందు్రం డయ్యమృతకుంభంబు నపహరించె దాని కాస్త
రణంబుగాం బఱచినకుశలయందు దంటిన యమృతలేశము నాస్వాదించినక
తనం వారలకు నాలుకలు చీలికలై రెండయ్యె. ౩౬౫

గీ॥ జననిశాపంబు దవిలినసర్పములు భ, యమున వాసుకి మొదలుగ
నజునికడకుం, జని శరణుం జెంద నిట్లనె జలజభవుండు, కరుణ నెమ్మది
నెంతయుం గడలుకొనంగ. ౩౬౬

వ॥ జరత్కారుం డనుముని తనకు సనామిక యగుకన్నెం దక్క
నొండుపడంతి వరింప నని ప్రతినవట్టినవాం డతనికి వాసుకిచెలియ లగు
జరత్కారు వనుదానిం బెండ్లి సేయుండు వా రిరువుర కాస్తీకుం డనువాం
డుదయించి మిమ్ము రక్షింపం గలాండనవుడు వాసుకియు నతనివెదకి తన
చెలియల నర్పించిన నమ్మునివరుండును వాసుకిం గని నీచెలియలు నా
కెన్నం డప్రియం బాచరించు నప్పుడ వీడం గలవాండ నని సమయం
బొనరించి పరిగ్రహించి వనాంతరమ్మునం బర్ణకుటీరం బేర్పఱచుకొని
యందు సుఖమ్ము లనుభవించుచు నొక్క నాండు కృతభోజనుండై. ౩౬౭

క॥ నను లేప వలవ దని తన,వనితకు బోధించి యాతపస్వివరుండు భా
వినియతి నయ్యెడం దా ని,ద్రను జెందుడు నస్తగిరికి రవియుం జేరెన్.

వ॥ ఇట్లు సంధ్యోపాసనాసమయం బగుడు నాపె యిట్లనివితర్కించె

గీ॥ నిదుర లేపిన భర్తకు నెదురు సేంత, లేపకుండినచోం గర్మలోప మొదవు
కర్మలోపమ్ము సేయుటకన్న భర్త, కెదురు సేంతయ వరమని యెంచికడక

ఆ॥ వె॥ అరుణుం డస్తగిరికి నరుగుచు నున్నాండు, సంధ్య వార్చికొనెడి
సమయ మయ్యెం, గాన నిదుర లేచి కాల్యకృత్యంబులు దీర్చి
కొనుం డటంచుం దెఱవ లేపె. ౩౭౭

వ॥ లేపిన నమ్మునివరుండును గోపోద్రేకమున నా కెదురు చేసితివి గాన నీకన్నయింటికిం బొమ్ము నాయిచ్చ నే నేగెద ననవుడు భయసంభ్రమాక్రాంతహృదయ యగుచు నమ్మునిం జూచి యయ్యతివ మెల్లన నిట్లనియె. ౩౨౧

క॥ మాయన్న నీకిడినసదు,పాయం బిట్లని నెట్లుఫలియించువృథా,పాయక న్యాయమె యనునా,ప్రోయాలికి భర్త "యస్తి పో" మ్మనిపలికెన్.

వ॥ అయ్యతివ పుట్టినింటి కరిగి కొండొకకాలమ్మున కాస్తీకుం గనియె నాతం డిక్ష్వారణమ్మున భవన్మఖంబున కేతెంచి సర్పపక్షపాతి యగుట నీయాగం బాఁగె నీవు నయ్యాగంబు విరమించి మంచి చేసితి వని ప్రశంసించి మఱియు ని ట్లనిెను. ౩౨౩

గీ॥ భారతం బఖిలము విన్న పావనుఁడవు,నీయదృష్టం బొరులకు వర్ణింపఁదరమె, నీజనకుఁ డొక్క రుఁడ కాఁడు నీసుకృతము, వలన నన్వయ మది యెల్లఁ బావనంబు. ౩౨౪

క॥ దేవీయజ్ఞము పేర్మిక, గావింపుము భాగవతపుగాథల నెల్లన్ నావలన వినుము శ్రీపర, దేవతకుక మించినట్టి దేవత కలదే.

క॥ దేవీపూజకు లగుకుల, పావనులకు వృద్ధి చెందు బహువైశ్వర్య శ్రీవిజయాయుర్దాయసు,ఖావిఖ్యాతులును నఖిల మగుభోగములున్.

వ॥ కావున శ్రద్ధావంతుండవై దేవీభాగవతంబు వినుము.

గీ॥ ఎవరు పరదేవతాపూజ నేవగింత్రు, వారహో! దుఃఖభాక్కులు వారమూర్ఖు, లెవరు పరదేవతాపూజ కిచ్చగింత్రు, వారహో! సౌఖ్యభాక్కులు వార కృతులు. ౩౨౭

గీ॥ బ్రహ్మ మొదలగు దేవతల్ భక్తి నేజ, గజ్జనని సేవ లొనరించి కాలయాప, నం బొనర్తురో యాజగదంబ పూజ, కిచ్చగింపనిమానవుఁ డెవఁడు జగతి. ౩౨౮

క॥ మును భగవతి శ్రీనారా, యణునకు వచియించె నేమహాభాగవతా ఖ్యనెసఁగుదివ్యచరిత్రము,వినుమా! యద్దానఁనీయభీష్టములొలయున్.

వ॥ అని సాత్యవతేయుండు జనమేజయునకుం జెప్పె నని సూతుండు శౌనకాదులకుం జెప్పిన వారును వ్యాసుం డెట్లు సెప్పె నెఱింగింపు మనుటయు. ౩౮౦

స్కంధాంతపద్యములు

క॥ వీరనవిప్రీశానకుమార! ధరారమణమౌళిమండితపదపం
కేరుహ! గౌరవధీరను, తారామద్రావిడాన్వయాభరణమణీ. ౩౮౧

క॥ దుర్గయశాస్త్రిసహోదర!, భర్గపదాంభోజయుగళబంభర! రిపుష
డ్వర్గజయజనితకీర్తిని, రర్గళధారామరాపగాంచితభువనా. ౩౮౨

స్రగ్విణీవృత్తము॥ పాపమాంబోదరప్రాజ్యపూజ్యోదయా
ప్రాపకీభూతభూపాలదీవ్యద్దయా
దీపితాశాంతకీర్తిస్తుతప్రాభవా
వ్యాపృతాన్నప్రదానాన్నపూర్ణాధవా. ౩౮౩

గద్య.

ఇది శ్రీ కింకవీంద్ర ఘటాపంచానన విద్వత్కవి బాలకలానిధి
బాలసరస్వతీ శతావధాని తిరుపతివేంకటేశ్వర ప్రణీతం
బయిన దేవీభాగవతంబను మహాపురాణమునందు
ద్వితీయస్కంధము.

శ్రీపరదేవతార్పణమస్తు.

శ్రీ. శ్రీ. శ్రీ.

| పుట | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 9 | 1 | థపత్ని | థమపత్ని |
| 11 | 14 | నంజ | నఁజ |
| 14 | 6 | సీ॥ వ | సీ॥ నవ |
| 16 | 15 | క్తి గను | క్తింగను |
| 24 | 2 | పుడు | చుడు |
| 27 | 24 | తవ | తప |
| 31 | 3 | మరు | మఱు |
| 31 | 25 | నోచ | నోఁచ |
| 32 | 14 | లెరుం | లెఱుం |
| 34 | 26 | ప్పికయును | ప్పియుఁగడు |
| 35 | 7 | గొమా | గుమా |
| 37 | 28 | దర్థ | దర్ధ |
| 39 | 2 | తునినమ్మ | తునమ్మ |
| 40 | 17 | బునున్న | బుననున్న |
| 42 | 28 | వేడిన | వేఁడిన |
| 46 | 19 | దా!మో | దామో |